సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతికి 4 అ.

# ఆంధ్రపత్రిక

స

సం.

28.10

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

విజయ ఆశ్వయుజ బహుళ సప్తమి, బుధవారం



"క్షురస్యధారా నిశితాదురత్యయా దుర్గంపథ..."

చిత్రకారుడు :—వడ్డాది పాపయ్య (శ్రీకాకుళం.)

## విషయానుక్రమణిక

చిత్రం : ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి "పెంపుడు కొడుకు"లో సావిత్రి.





# కాలక్షేపం

"ధృతిగొని రోగముల్ జరయు
దేహము నొంపకముందె, యింద్రియ
ప్రతిహతి లేకముందె, తన
ప్రాణవిరామము రాకముందె, పం
డిత జను డాచరించదగు
తీవ్ర ప్రయత్నము ముక్తికిన్; మహో
ద్ధత శిఖి నిల్లు గాలుతఱి
దాలిమి నూతులు ద్రవ్వఁబోవ్వునే?"

తా॥ రోగములున్నూ ముసలితనమున్నూ దేహమును కృశింపజేయక పూర్వమే, కన్నులు మొదలైన యింద్రియముల పటుత్వము చెడిపోకపూర్వమే, ప్రాణావసాన దశ రాకపూర్వమే, పండితుడైనవాడు సమగ్రుడై తనముక్తికి ప్రయత్నము చేయదగును. కాని, బ్రహ్మాండమైన మంటలు చెలరేగి ఇల్లు కాలిపోవుచున్నప్పుడు ఓపికగా నూతులు త్రవ్వడం యుక్తమగునా?

ఇల్లు కాలుతూఉంటే నుయ్యిత్రవ్వడం యుక్తం కాదు. చేతులు కాలిన తర్వాత ఆకులు చేతబట్టుకొనుట యుక్తము కాదు. ప్రాణం పోతూఉంటే డాక్టరుకోసం పరుగెత్తడం యుక్తం కాదు. కాని, ఆఖరు క్షణం వరకూ, ఆశ అనేది ఏడ్పిస్తూనే ఉంటుంది. భర్త ప్రాణం పోయిన తర్వాత కూడా సావిత్రికి ఆశ అనేది పోలేదు.

యమధర్మరాజుతో ఎదుటబడి వెంటబడి కంటతడి పెట్టకుండా పట్టిన పట్టు నెగ్గే వరకూ, పతిభిక్ష పెట్టేవరకూ, యముని విసిగించి, తన భర్త ప్రాణాలు తీసికొన్న యముని ప్రాణాలు తీసివేసింది. ఇదంతా సత్యవంతుని కథ. కాని యీకాలంలో అది సత్యం అని గాని, సత్యవంతులు నమ్మవలసిన కథ అనిగాని ఆమోదించక, చాలామంది హేళన చేస్తారు. సత్యవంతుడున్నూ సావిత్రియున్నూ ఒక అరణ్యంలో మకాంచేసి ఉండగా, సత్యవంతుడు ఒకనాడు కట్టెలు కొట్టడానికి, చెట్లకొమ్మలు కొన్ని నరుకుతూఉన్నాడు. ఆ సమయంలో అతనికి అకస్మాత్తుగా అమితమైన తలనొప్పి ప్రారంభమైంది. సత్యవంతుడు నడివయస్సులో ఉన్నాడు. మంచి బలశాలి. రాజపుత్రుడు. కాఫీ మొదలైన వ్యసనాలు ఏమిన్నీ లేవు. అలవాటైన కాఫీ అలభ్యమైనప్పుడు తలనొప్పి రావడం తరచుగా పడుచువాళ్ళ విషయంలో కూడా ప్రత్యక్ష ప్రమాణంగా కన్పిస్తోంది. కాఫీ కషాయం కడుపులో పడనిరోజున శరీరం స్వాఫీగా ఉండదనే విషయం సమస్తమైనవారికీ తెలిసిన విషమవిషయం. కాఫీ కషాయం త్రాగనిరోజున జీవితం అంతా విషకషాయంగా ఉంటుంది. తలనొప్పి, కణతలనొప్పి, కత్తికోతలనొప్పి, యమదూతల యీటెపోటులనొప్పి అది. చుట్టుప్రక్కల వాళ్లు కాఫీత్రాగేవాళ్ళు కాకపోతే, వాళ్ళందరూ "కాఫిర్లు" అన్నంత ఆగ్రహమూ, కాఫీమతావేశమూ వస్తుంది. అటువంటి కాఫీ పాన లోపాన శిరోవేదన ఏమిన్నీ సత్యవంతునకు రాలేదు. శిరోవేదన ప్రారంభించిందో లేదో సీలు వేసినట్లుగా కళ్ళు మూసికొని పోయినాయి. నేలమీద వాలియున్న తన భర్తను విడిచిపెట్టకుండా సావిత్రి జాగరం చేస్తూనేఉంది. ఎందుకో? ఎవరి దయకొరకో? అక్కడ ఉండిచూచినా, అర్థంకాదు మనకు. ఎదురుగుండా ఆమెకు యమధర్మరాజు కన్పించాడని గ్రంథాలలో వ్రాశారు. ఆమెకు కన్పించిన యముడు ఎటువంటివాడో ఆరోజున ఎవరో ఫొటోతీసినట్లుగా యీరోజువరకూ సినిమాలో తెరమీద చూపిస్తున్నారు. అవన్నీ యమఫొటోలు. చాలా సినిమా ఫొటోలు ట్రిక్కు ఫొటోలనిన్నీ మాయ ఫొటోలనిన్నీ అంటారు. అటువంటి సందర్భంలో యముడు కన్పించినాడనేది కల్పన కావచ్చు. ఏమైనప్పటికీ తన భర్త కళ్ళుమూసికొని స్పృహలేకుండా పడిఉన్నప్పుడు తాను ఒంటరిగా ఆ భర్తచెంతనే ఉన్నది. కాని నిస్పృహ చెందలేదు. భర్త మృతికై తాను మూర్ఛిల్లి మృతిజెందలేదు. ధైర్యం విడువలేదు. భర్తకు తిరిగి ప్రాణం

దాసు వామనరావు

రాగలదను ఆశతోనే ఉంది. బహుశః ఆ అరణ్యప్రాంతంలో ఏఅడవిజాతివారైనా కన్పిస్తే, వారితో మొఱపెట్టుకొంటే, వారు యిచ్చిన మందులు పసరులు ఏవైనా ప్రయోగిస్తే,పరమేశ్వరానుగ్రహంవల్లఅతడు తిరిగీ కళ్ళుతెరచి యిల్లాలువంక చూచి యిదంతా నీ మంగళసూత్ర మహిమ యని ఆ మహిళామణి నభినుతించి యుండవచ్చు.

పెద్ద నిద్దురపోయినవాడు మరల కనులు తెరచి చూడడం కనివిని యెరుంగని విషయం అంటారు. కాని, ఆఫ్రికా ఖండంలోని యుగాండా దేశంలో *Sleeping Sickness* (నిద్రరుగ్మత) అనే వ్యాధి ఒకటి ఉన్నది. అచటి క్రిమికీటకములమూలంగా ఈ నిద్రరుగ్మత వస్తుంది. అపారమైన శిరోవేదనతో యీ వ్యాధి అకస్మాత్తుగా ప్రారంభమగును. అది యమ తలనొప్పి- అబాధ కెటువంటి యోధుడైనా, గొడ్డలితో కొట్టిన చెట్టువలె కూలిపోతాడు. స్పృహ తప్పి నిద్రలో మునిగి యోగముద్రలో ఉంటాడు. చికిత్స పూర్తి అయ్యేవరకు అహోరాత్రములు అగమ్యగోచరావస్థలో అచేతనునివలె పడిఉంటాడు. అది ఒక పెద్ద నిద్దుర. దానిలోనుంచి తిరిగి లేచి తల ఎత్తుకొని తిరగడం పునర్జన్మవంటిదే. ఇటువంటి అచంచల స్తబ్ధావస్థ యీ యుగాండా జ్వరమువల తటస్థించిన తలనొప్పితో, నిద్రరుగ్మతమూలంగా సంభవించి సత్యవంతుడు మృత్యుముఖ సుముఖుడై యుండవచ్చు. ఏమైనప్పటికీ, ఆ పురాణకాలంలో యీ యుగాండాజ్వరం వివరం తెలియకపోవచ్చు. సత్యవంతునకు ఆ పెద్ద నిద్దురలో యముడు కన్పించినాడో లేదో గాని, సజీవురాలై స్వస్థతగాఉన్న సావిత్రికి మాత్రం స్పష్టంగా కన్పించాడు. సత్యవంతుడు కొన్నిదినాలు స్పృహతప్పిపడియున్నాడు. అందువల్ల అతడు పూర్తిగా కీర్తిశేషుడైనట్లుగా తీర్మానించవలసివచ్చింది. కాని, రెండు మూడు దినములకు పిమ్మట నిర్వికల్ప సమాధినుంచి నిరుపమానతేజుడై మృత్యుంజయుడైనట్లు సత్యవంతుడు సజీవుడై సావిత్రితో సరససల్లాపములాడెను. ముక్కంటి కంటి మంటకు రూపుచెడిన మరుడు మరల నవమన్మథుడై వెలసినవిధంబువకీర్తిశేషుడైన వ్యక్తి మరల చైతన్యమూర్తియై, పురాణగాథలలో శశ్వత్కీర్తి గాంచి,కొంతకాలము తిరిగి యీ ప్రపంచములో జీవించి రెండవ పర్యాయము నిజముగ నీజగము వీడి,రెండవ మారు ఖండితముగ కీర్తిశేషుడయ్యెను. ఏమైనప్పటికీ సత్యవంతుడున్నూ సావిత్రియున్నూ పురాణప్రసిద్ధ పురుషులు. సత్యవంతునిజ్వరమొక పురాణజ్వరమని భావించవలెను. వారు ఒకప్పుడు యీ ప్రపంచంలో ఉండేవారు. ఇప్పుడు లేరు. సత్యవంతుడు ఒకసారి యమలోకానికి వెళ్ళి మళ్ళీ సావిత్రి మహిమవల్ల మానవలోకానికి మరలి వచ్చినప్పటికిన్నీ, అటుతర్వాత కొంతకాలం జీవించి తిరిగీ మరణించెనని అంగీకరించాలి ఈ రెండవ పర్యాయము అతడు నిర్జీవియైనప్పుడు అతని ప్రాణములను యముడు తీసికొనిపోకుండా అడ్డుపడుట కెట్టి దొడ్డయత్నమూ సావిత్రి చేసియుండలేదు. అతడు రెండుసార్లు కీర్తిశేషుడైతే, ఆమె ఒక్కసారే కీర్తిశేషురాలైంది.



ఆంధ్ర ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారు యిటీవల మద్రాసుకు వచ్చినప్పుడు పరిశిష్ట మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు ఫోర్టుసెంట్ జార్జిలో విందు చేశారు.

కాని, ఒక్క విషయం గమనించి గ్రహించాలి. సత్యవంతునకు యీ సంసార భవబంధ విమోచన కలిగించుటకొరకై భగవంతుడు మొదటిసారి ప్రయత్నిస్తే, తిరిగి అతనిని వెంటబెట్టుకొని యింటికి తీసికొని వచ్చి,కొంతకాలముసంసారంచేసి,సంతానం పొంది, సమస్తైశ్వర్యములను అనుభవించేటట్లు చేసింది సావిత్రి. భర్తకొరకు భార్య పరితపించిన దెందుకు? భర్తయొక్క ముక్తికోసం కాదు. "నా భర్తకు పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోకమును ప్రసాదించవలసినది" అని యమధర్మరాజును సావిత్రి వేడుకొన్నదా? లేదు. ఆ విధంగా ఏ సతి తన పతివిషయమై ప్రార్థించిందో పురాణాలు శోధించి చూడాలి.

అందాకా ఎందుకు? తన కొడుకు దీర్ఘాయుష్మంతుడై పెరిగి పెద్దవాడై పెళ్ళి చేసికొని, కార్యం చేసికొని, బిడ్డలతండ్రియై తామరతంపరగా పిల్లపిల్ల తరమునా వంశవృద్ధి కలవాడై మార్కండేయులంత ఆయుస్సుతో అష్టయిశ్వర్యములతో వర్ధిల్లవలెనని కొడుకును తల్లి ఆశీర్వదిస్తుంది. కాని, శంకరాచార్యులవారు సన్యసిస్తానంటే తల్లియైన ఆర్యాంబ అంగీకరించలేదు. "నాయనా! నీవు పెండ్లాడి యజ్ఞయాగాది క్రతువులను చేసి సత్సంతానమును పొంది నన్ను బూడిదచేసి అటుతర్వాత సన్యాసము తీసికొనుము" అని ప్రార్థించింది.

ఒకనాడు శంకరుడు నదిలో స్నానం చేస్తూఉంటే, తల్లికూడా నదికి స్నానార్థం వచ్చింది. అప్పుడు ఒక మొసలి శంకరుని కాలు పట్టుకొని, ఏటిలోనికి, లోతు నీటిలోనికి యీడ్చుకొనిపోవుటకు ప్రయత్నించినది. అప్పుడు శంకరుడు "అమ్మా! నా కాలును మొసలి పట్టుకొన్నది. ఇంకొక నిమిషములో నా ప్రాణము పోవును. సన్యాసినై చచ్చినట్లయితే మోక్షము లభిస్తుంది. లేదా, సన్యాసము పునర్జన్మవంటిది. నేను సన్యాసం స్వీకరిస్తే ఒకవేళ యీ గండము తప్పిపోవునేమోగదా!" అన్నాడు. తన కొడుకు బ్రతికి ఉంటే అంతే చాలునని అప్పుడు ఆర్యాంబ అందుకు అంగీకరించింది. తల్లి అనుమతి లేకుండా సన్యసించుటకు వీలు లేదనే అసందర్భం అంతటితో ఆ తిక్క

## ★ కాలక్షేపం

శంకరయ్యకు తొలగిపోయింది. వెంటనే శంకరుడు "సన్న్యస్తం మయా" అని ప్రేషోచ్చారణము చేయగానే శంకరుని కాలు విడిచి మొసలి వెడలిపోయింది. శంకరుడు నీటిలో నుంచి బయటకు వచ్చి తన తల్లినీ, ప్రీతియమైన ఆస్తినీ, తన జ్ఞాతులకు ఒప్పగించి నర్మదా నదీతీరప్రాంతానికి వెళ్ళి అక్కడ గోవింద పాదులవారిని సందర్శించి ఆయన ద్వారా లోకమర్యాదానుసారంగా ఉపదేశంపొంది పూర్తిగా సన్యాసాశ్రమం స్వీకరించాడు.

కొంతకాలానికి శంకరుని తల్లి యగు ఆర్యాంబకు అవసానదశ వచ్చింది ఆసంగతి తెలిసి శంకరుడు తల్లివద్దకు వచ్చాడు. తన కొడుకు తనచెంత నుండగా ఆత్మ సంతృప్తితో అయిహికయాత్ర ముగించింది ఆమె. కాని, సన్యాసియైన శంకరుడు ఆమెకు కర్మ చేయరాదు అని శంకరుని జ్ఞాతులు, అడ్డగించారు. అది శాస్త్ర విరుద్ధం అన్నారు. కాని, తల్లికి దహన సంస్కారం తానే చేస్తానని శంకరుడు అంతకు పూర్వము తల్లికి వాగ్దానం చేశాడు. ఆవాగ్దానం ప్రకారంగా సన్యాసియైన శంకరుడే కర్మ చేశాడు.

శంకరుడు పరకాయప్రవేశాది విద్యలలో ప్రవీణుడన్నారు. అమరుకుడనే రాజు మరణిస్తే అతని దేహంలో శంకరుడు ప్రవేశించి అతని రాణివాసంలో కొంతకాలం ఉండి భోగించి కామ శాస్త్రరహస్యమును గ్రహించినాడని ఆయన జీవితకథలో ఒక గాథఉంది. కామశాస్త్రంలో కూడా ప్రవీణుడైన విమ్మటనే మండనమిశ్రుని భార్యయగు ఉభయభారతిని ఓడించినాడని ప్రతీతి. అటు తర్వాత అభినవగుప్తుడనే మాంత్రికుడు శంకరాచార్యులవారిమీద మంత్రప్రయోగం ఒకటి చేసినాడట. ఆ ప్రయోగం అతడు చేయడం మూలంగా "భగందర" వ్యాధి శంకరాచార్యులవారిని పట్టి పీడించినది. ఔషధమువల్ల నివారించుటకు వీలుకాని వ్యాధి అయింది. సహింప శక్యం కాని బాధను శంకరుడు అనుభవించాడు. ఆయన ఆ బాధ పడుచున్న కాలమందు తోటకాచార్యుడు ఆయనకు అహోరాత్రములు ఉపచారం చేశాడు. ధన్వంతరితో సమానులైన పెద్ద వైద్యులు చికిత్స చేసినా ప్రయోజనం లేకపోయింది. అప్పుడు పద్మపాదుడనే శిష్యుడు నరసింహమంత్రం జపించినపిమ్మట ఆచార్యుల వారికి ఆ వ్యాధి పోయింది. ఆ వ్యాధిని ఆయనకు ప్రయోగించిన అభినవగుప్తుడు ఆ వ్యాధితోనే మరణించాడు. మరి కొంత కాలానికి శంకరులు కేదారనాథ్ వెళ్ళి అక్కడ కొంతకాలంఉండి పరలోకప్రాప్తి పొందిరి. మళయాళ దేశంలో కాలాటి అనే ఊరిలో జన్మించిన యీ అవతార పురుషుడు 7 సంవత్సరముల వయస్సులోనే సకలశాస్త్రపారంగతుడై పరతత్వవేత్తయై సన్యసించి యావద్భారతదేశం రైళ్లు లేని కాలంలో మైళ్ళకొలది ప్రయాణంచేసి



బలాక మహాసభ

ఫొటో :—పి. వీరన్న (విజయవాడ.)

ఆస్తికమత ప్రతిష్ఠాపకుడై సుమారు 30 సంవత్సరముల వయస్సులో హిమాలయ పర్వత ప్రాంతములందు కేదారనాథ్‌లో సమాధి యైనాడు.

"స్మృతిగొని రోగముల్ జరయు దేహము నొంపకముందె...తన ప్రాణవిరామము రాకముందె...జను డాచరింపదగు రీవి ప్రయత్నము ముక్తికిన్" అనే మాట శంకరాచార్యులవారి విషయములో సాధ్యమైనట్లుగా అందరికీ సాధ్యమవుతుందా?

ముక్తికోసం చేయవలసిన కృషి ఒకటి ప్రత్యేకంగా ఉన్నదనే సిద్ధాంతాన్ని శంకరాచార్యులవారుకూడా శంకించవచ్చు. ఆయనవలె సన్యసించకపోతే, ఆయనవలె ఉపన్యసించకపోతే, ఆత్మపరిపక్వం కాదా ? ఆత్మసాక్షాత్కారం కాదా ? ముక్తిమార్గం లేదా ? గృహస్థుగా ఉండి, గుడ్డివాళ్లకూ కుంటివాళ్లకూ యథాశక్తిగా ధర్మంచేస్తూ అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ, "నిజదారసుతోదర పోషణార్థమై" హాళికులైన బమ్మెర పోతరాజుగారు ముక్తి పొందలేదని వాదించలేము. కాకర్ల త్యాగరాజులవారు రామనామ సంకీర్తనం చేసుకుంటూ సతీ సమేతంగా తన జీవయాత్ర ఆదర్శప్రాతంగా సాగించారు. సన్యాసులకు భిక్ష చేసెడి గృహస్థు వ్యర్థుడేనా?

"బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావధూత కాపాలికానాథ్యనాథులకు" కొంగు బంగారం వంటివాడైన గృహస్థుయొక్క గార్హస్థ్యము గర్హింపదగినది కాదు. అందుచేతనే, గార్హస్థ్యమునకు సరియే? అని పెద్దన్నగారు పెద్ద ప్రశ్న వేశారు.

ఈసంసారంమీదనే కాదు. ఈ శరీరముమీదకూడా రోతపుట్టించవలసిన అవసరం లేదు. ఈసంసారదూషణ అనేతెలుకవిత్వమే చిట్టచివరకొక రోతకవిత్వం. స్త్రీలను పురుషులు దూషించడంలోనూ, పురుషులను స్త్రీలు దూషించడంలోనూ అర్థం లేదు. ఆత్మవిచారణ చేయలేనివాడే అన్యదూషణ ఎక్కువగా చేస్తాడు.

చిన్న పిల్లవాడు తప్పటడుగులు వేస్తూ గడపదాటలేక ద్వారబంధం కాలికి తగిలి "క్షోణీతలంబునన్ నుదురు సోకగ" గ్రిందపడి, క్యావుమని ఏడుస్తాడు. కాని, ఏ ముత్తవతల్లియైనా వచ్చి, "అన్నా! మా అబ్బాయిని క్రిందపడగొట్టావా?" అని గడపను తిట్టి రెండు దెబ్బలు కొట్టిన యెడల పిల్లవాడు ఏడుపుమాని, తప్పు తనది కాదని తృప్తిజెందు,

(52-వ పేజీ చూడండి)




## 5

జనవరి మాసంలో ఇట్టే చీకటి పడిపోతుంది. గ్రింగ్వార్ సభామందిరం దాటి బైటపడేసరికి చీకటి పడుతోంది. అప్పుడే చీకటిపడ్డం అతడికి అనుకూలంగానే తోచింది. మనుష్యుల పొడ కానరాని చోటు కావాలి అతడికి. ఎవ్వరూ రాని ఏ చీకటి గొందిలోనో కూర్చుని తత్వవిచారంతో కాలక్షేపం చేసి హృదయతాపానికి చికిత్స చేసుకోవాలని కవి కోరిక. అతడికి తుది ఆశ్రయం బుల్వారం. తలదాచుకోడానికి ఆశ్రయం లేదు. తన నాటకం భంగపడిన తరువాత ఇంక తన నివాసానికి తిరిగిపోలేడు. నాటకం గురించి అధికారులు సంతసించి బహుమతి ఇస్తే బసకు ఉన్న ఆరు మాసాల అద్దె బాకీ తీర్చాలనుకున్నాడు. కాని ఫలితం విపరీతమయింది. ఇప్పుడతనికి మిగిలినదల్లా ఒంటినున్న దుస్తులే. జేబులో చిల్లిగవ్వ లేదు.

కొంతసేపు దగ్గరి వీధులు సంచారం చేశాడు. ఏ ద్వారం ముందో, ఏ చూరుకింద విశ్రమించాలో తెలియక వెతికాడు. సభామందిరం ప్రక్కన ఒకచోట తిన్నె ఉన్నదని అతడికి గుర్తుకొచ్చింది. తిన్నె పైనే మరొక చిన్న రాతిపలక ఉన్నట్టు అతనికి తెలుసు. అది బికారికే కాదు కవికికూడా తలగడకింద పనికొస్తుంది. అంచేనే సభామందిరం వైపు మరలాడు.

సభామందిరం అంతదూరంలో ఉండగానే 'మూర్ఖాగ్రేసరుని' ఊరేగింపు అతడి కెదురయింది. పెద్ద కాగడాలతో ఊరేగింపు వస్తోంది. పాలిబొబ్బలు వినబడుతున్నాయి. దగ్గరికి వెళ్ళాడు. ఒక నాటకంలో బాండ్ మేళం కనపడింది. తిరిగి తన నాటకానికి జరిగిన అవమానం అతడికి జ్ఞప్తికివచ్చింది. అతడు లోలోన ఆక్రోశించాడు. వెనుతిరిగి కాలికి బుద్ధిచెప్పాడు. బికారుల్ని, 'మూర్ఖాగ్రేసరుని' తలుచుకుంటే అతడు నిలువెల్లా కంపించి పోతున్నాడు.

ప్రక్క వీధిలో ఆకతాయి పిల్లలు బాణసంచాతో పేరలాడుతున్నారు. మరొక వీధి దాటాడు. అక్కడొక వంతెన ఉంది. వంతెన దిగువను పెద్ద కాన్వాస్ గుడ్డలపైన ఫ్రాన్స్ మహారాజు, రాకుమారుడు, ఫ్లాండర్స్ రాకుమార్తెల చిత్రాలు కనపడాయి. దీపాల వెలుగులో కొందరు నిలబడి చిత్రాలను పరిశీలిస్తున్నారు. "చిత్రకారుడు అదృష్టవంతుడు" అనుకున్నాడు గ్రింగ్వార్. వంతెన దాటగానే ఒక చీకటిసందు కనపడింది. దాపైన నదిపై పెద్ద వంతెన. వంతెన దాటాడు. ఇంక ఇక్కడికి ఉత్సవాలు దూరమే అనుకున్నాడు. కొన్ని వీధులు మలుపులు తిరిగాక నదిలో చిన్న ద్వీపఖండం కనపడింది. అక్కడ నదిని దాటించే బోటు ఉంది. బోటువాడు బోటులోనే నిద్రపోతున్నాడు: "ఆహా! ఎంత నిశ్చింతగా నిద్రపోతున్నాడు! ఇతడికి ఏ వైభవం గురించిన కలలూ లేవు! మహారాజుల వంశాలలో వివాహాలతో ఇతడికి నిమిత్తం లేదు. నేనో! కవిని! నాకు మిగిలేది ప్రజల అవహేళన. ఛీ!" అనుకున్నాడు. నదీతీరం సమీపించాడు. నీళ్ళవద్ద నిలిచాడు. "అబ్బ! ఈ నదిలో మునిగిపోతే ఏ బాధా ఉండదు కదా! కాని—నీళ్లు మరీ చల్లగా ఉన్నాయి" అనుకున్నాడు. ఇంతలో దగ్గరలోనే ఏదో పేలిన శబ్దం వినవచ్చింది. బాణసంచా! "ఇక్కడ కూడా ఇదేనా?" అని విసుగుచెందాడు.

ఇంక ఎక్కడకు వెళ్ళినా ఈ ఉత్సవాలు, ఈ కోలాహలం తనను వెంటాడకమానవు. ఇదిపనిగాదనుకున్నాడు. ఊరేగింపులోనే కలిసిపోవాలని నిశ్చయానికొచ్చాడు. అక్కడ చలిమంటలేనా ఉంటాయి. వెచ్చగా ఉంటుంది! గ్రీవ్ చౌకు దిక్కుగా తిరుగు ముఖం పట్టాడు. అక్కడ రొట్టికూడా దొరకవచ్చునేమో!

మూలం :
విక్టర్ హ్యూగో

అనువాదం :
సూరంపూడి సీతారామ్

గ్రీన్ చౌకు నిర్జనంగా ఉంది. చుట్టూ పెద్ద పెద్ద కట్టడాలు, చిన్న చిన్న ఇళ్లు దట్టంగా ఒదిగి ఒదిగి కొలువుపోసినట్లున్నాయి. పగటి వేళ చూస్తే మధ్యయుగాల శిల్పం, కొత్తగా చేర్చిన ఇళ్ళు, మధ్యరకం భవనాలు అంతా అయోమయంగా కనపడతాయి. ఒకవైపున నదీతీరం ఉంది. పూర్వ శతాబ్దాలలో గుర్రపు శాలలు, పరిచారకుల నివాసాలు వీధివైపున కుండేవి. ఇప్పుడలా కాదు. ధనవంతుల ఇళ్ళు వెనక్కు తిరిగి వీధిముఖమైనాయి.

చౌకు చివర మూడు పెద్దభవనాలున్నాయి. ఒకటి పూర్వ రాజభవనం, ఒకటి చర్చి, మరొకటి స్తంభాల సావిడి. సావిడి ప్రక్క గదిలో తుపాకులుంటాయి. చర్చిలో దేవుణ్ని ప్రార్థించినా పొందలేని స్వత్వాలను ప్రజలు తుపాకులు చేతబట్టి సాధించుకోడం కోసం కాబోలు; ఎవరికీ కొంపనట్లు అక్కడ దాచబడినాయి తుపాకులు.

రాత్రి వేళ చీకటి రాక్షసులు పొంచి కూర్చున్నట్లు కనపడుతున్నాయి ఆ యిళ్లన్నీ. చౌకు చూస్తే దుస్వప్నంవలె భయంకరమైన ఆనాటి చరిత్ర జ్ఞప్తికి వస్తుంది. మైదానం మధ్యలో "న్యాయమూ, నిర్ణయమూ" ఉన్నాయి. అంటే ఒకటి ఇనపచక్రం, మరొకటి శాశ్వతంగా రాతితో నిర్మించబడిన ఉరిస్తంభం. ఇక్కడ అనేకమంది ప్రజలు హింసించబడ్డారు; అనేకమంది నిండు ప్రాణాలు నిలువునా తీయబడ్డాయి. రెండూ ప్రక్క ప్రక్కనే ఉన్నాయి. అనాడు సామంత రాజులు, మఠాధికారులు, నగరాధికారుల నిరంకుశ పరిపాలనలో నిర్విఘ్నంగా కొనసాగిన దారుణ హింసాప్రక్రియ, అమానుష వినోదాలు నేడు బహిష్కరించబడుతున్నాయి. సామంతుల నిరంకుశపాలన (ఫ్యూడలిజమ్) తోపాటు, ఆ అమానుష ప్రవృత్తికూడా అంతరించింది.

## 6

చౌకు చేరేసరికి గ్రింగైర్ శరీరమంతా చలిలో బిగుసుకుపోతోంది. రాజవీధులు తప్పించుకునే వచ్చాడు. కాని మఠాధికారుల మిల్లులలో నుంచి నీటి జల్లులు వచ్చి అతని దుస్తులు తడిపివేశాయి. "మఠాధికారులికి మిల్లులెందుకో! అధికారం ఊడితే అర్జున మిగుల్తుందని కాబోలు" అనుకొన్నాడు. చౌకు మధ్యలో వెలుగుతున్న భోగిమంటలను సమీపించాడు. దూరానికి పల్చగా కనపడిన జనం దగ్గరలో పెద్దగుంపుగా కనపడ్డారు. మంటచుట్టూ దూరంగా ఒదిగి నిలబడ్డారు జనం. అంతమంది అక్కడేం చేస్తున్నారు? చలి కాగడానికేనా?

దగ్గరికి వెళ్ళిచూసేసరికి చలికాగడంకోసం కాదని తెలిసింది. అక్కడొక యువతి నాట్యం చేస్తోంది.

తత్వవేత్త, పండితుడు, వ్యంగ్యకవితలో నిధి అయిన గ్రింగైర్ కి అనుమానం తగిలింది ఆమె అప్సరసా? దేవకన్యా? మనుష్యాంగనా? అపురూపసుందరిని చూసేసరికి కవి కళ్లు జిగేల్ మన్నాయి. సన్ననైనందువల్ల పొడగరిగా కనిపించినా, ఆమె అట్టే పొడగరి కాదు. శిల్పిచేత మల్చబడినట్లున్న శరీరాంగాలు, లతవలె స్వాధీనం తప్పని తనువు, బంగారు తను ఛాయ, చిన్ని పాదాలు, ప్రసన్న వికాసమైన ముఖకాంతి—ఆమెను చూసి కవి విభ్రాంతుడైనాడు.

అందరి దృష్టులూ ఆమెపైనే లగ్నమై ఉన్నాయి. చినిగిన పాత పారసీతివాస్తీపైన ఆమె నాట్యంచేసి తిరుగుతున్నపుడు ఆమె నల్లని నేత్రాల కాంతి మెరుపులవలె అందరిపైనా మెరుస్తున్నాయి. రెండు చేతులతో తంబుర తలపైకెత్తి వాయిస్తూ ఆమె నాట్యం చేస్తోంది. ముడతలు లేని బంగారువన్నె చొక్కా, ఆచ్ఛాదనం లేని భుజాలు, ఆమె పాదచలనంలో పొంగి ఉరకలు వేస్తున్న చుక్కల పరికిణి, నేలనంటీ అంటనట్లున్న ఆమె చక్కని చిన్న పాదాలు, నల్లని శిరోజాలు అన్నీ చూడగా ఆమె మానవకాంత కాదని తోచింది కవికి.

"ఓహో! దేవకన్య! సాగరకన్య! అప్సరాంగన! ఎవరో కదా!" అని ఆశ్చర్యపడ్డాడు. ఇంతలో ఏదో కిందపడింది. ఆమె వంగి అది అందుకుంది. అది ఆమె తలపిన్ను. అదిచూసి 'ఓ! ఈమె జిప్సీ కాబోలు' అనుకున్నాడు. (జిప్సీలు అంటే నిలకడైన నివాసం లేక సంచారం చేసే జాతివారు.)

ఆమె తిరిగి నాట్యం చెయ్య నారంభించింది. రెండు బాకులు తీసుకుంది. మొనలను నుదుటిపై ఆనించి బాకులు నిలుపుతూ నాట్యం చేసింది. బాకు లొక దిక్కుగా తిరిగితే ఆమె మరొక దిక్కుగా తిరుగుతోంది. ఇంక ఈమె జిప్సీ అని నిర్ధారణ చేసుకున్నాడు. ఏ దేవకన్యా కాదని తెలిసిన తరువాత కూడా ఆమె సౌందర్యానికి అతడు ముగ్ధుడైనాడు.

ప్రేక్షకులవంక చూశాడు. ఒక వ్యక్తి ఆమెవంక తన్మయుడై చూస్తున్నాడు. గుంపులో అతని దుస్తులు తెలియడంలేదు. వయస్సు ముప్ఫైఅయిదుకి మించదు. కాని బట్టతల స్పష్టంగా కనబడుతోంది. కణతలవద్దను జారిన కొద్ది జుట్టూ నెరిసింది. విశాలమైన నుదుట ముడతలు, లోతైన కళ్లు చూడగా దీక్షకు లోబడిన వ్యక్తివలె తోచాడు. అతడి ముఖంలో ఏదో అసాధారణమైన ప్రతిభ, తేజస్సు గోచరిస్తున్నాయి. నిశితమైన అతని దృక్కులు, ఉల్లాసం వెల్లివిరియింప చేస్తున్న పదహారేళ్ల యువతిని చూస్తున్నకొద్దీ తీక్ష్ణమౌతున్నాయి.

చివరికా యువతి ఆయాసంతో నాట్యం నిలిపివేసింది.

"డాలీ" అని పిలిచింది జిప్సీ. చలాకీ మేక ఒకటి చెంగున లేచి ఆమెవద్దకు వచ్చింది. మేక గిట్టు కొమ్ములు, గిట్ట డెక్కలు, గిల్టు మెడపట్టే మంట వెలుగులో తళతళలాడాయి.

"డాలీ! ఇంక నీ వంతు" అంది జిప్సీ. మేక వద్ద కూర్చుని తంబుర వాయించడం మొదలు పెట్టింది.

"డాలీ! ఇదే నెలో చెప్పు" అంది జిప్సీ. తంబుర ముందుకు చాచింది. మేక ముందు కాలొకటి ఎత్తి డెక్కతో తంబురపైన ఒక తడవ తట్టింది. ఇది సంవత్సరంలో మొదటి నెల.

"డాలీ! ఇప్పుడెన్ని గంటలయింది?"

డాలీ ఏడుసార్లు తంబుర తట్టింది. అప్పుడే టవర్ గడియారం ఏడు కొట్టింది జనం ఆశ్చర్యభరితులైనారు.

"ఇదేదో మంత్రం పెట్టింది" అని ప్రేక్షకులలో ఒకడు అరిచాడు.

"ఇది మంత్రకత్తె" అన్నాడు మళ్ళీ. అరిచినవాడు బట్టతల వ్యక్తి. జిప్సీ యువతి ఉలిక్కిపడింది. అటు తిరిగి చూసి పాలిపోయింది. భయంతో ముఖం తిప్పుకుంది. ప్రేక్షకులు హర్షధ్వానం చేశారు. ఈ ప్రశంసలో ఆమె భయం మరిచిపోయింది. తిరిగి మేకవంక చూసింది.

"డాలీ! మన కెప్టెన్ రెపిూ సిపాయిల ముందు ఎలా నడుస్తాడో చెప్పు" అంది.

డాలీ వెనుక కాళ్ళు రెండింటిపైనా లేచి నడిచింది. 'మే' అని అరిచింది. అందరూ పగలబడి నవ్వారు.

జిప్సీకి ధైర్యం చిక్కింది. "డాలీ! మన ఫాదర్ శామో ఎలా ఉపన్యసిస్తారో చెప్పు."

మేక వెనక్కు వెల్లకిలబడి కూర్చుని ముందు రెండు కాళ్లూ ఎత్తి, విచిత్రంగా ఆడిస్తూ, తల ఎగరేస్తూ "మే! మే!" అని అరిచింది. భావమిదీ నిజంగా ఫాదర్ శామో తల ఎగరేస్తూ చేతులు ఊపుకుంటూ ఉపన్యసిస్తున్నట్లే ఉంది. జనం మరింత నవ్వారు.

"ఘోరం! అపచారం!" అంటూ అరిచాడు బట్టతల మనిషి. జిప్సీ అటు తిరిగి చూసింది. "ఓ! తాతగారికి కోపం వచ్చింది,"



## ఘంటారావం



అంది. నాలుక చూపి ఎక్కిరించింది. గిరుక్కున వెనక్కు తిరిగి ప్రేక్షకులు విసరిన డబ్బు పోగుచేసి తంబురలో పోసుకుంది. అందరివద్దా తంబుర చూపుతోంది వెండి, రాగి నాణేలు పడుతున్నాయి. గ్రింగ్వైర్ వద్దకు వచ్చింది. జేబులో చూశాడు. ఆమె ఆగింది. కవి తెల్లబోయాడు. జేబులో ఏంలేదు. తంబుర చూపి అతడివంక ఆమె విశాలనేత్రాలతో చూసింది. కవీశ్వరునికి ముచ్చెమటలు పట్టాయి. అతడి కాక్షణంలో ఎంతటి అమూల్యమైన వస్తువు లభించినా ఆమె కిచ్చేసేవాడే. కాని ప్రస్తుతం అతడు నిరుపేద.

వెనుకనుంచి కర్కశస్వరం వినవచ్చింది. "ఇక్కడనుంచి పోతావా లేదా. నువ్వో మాయలాడివి."

జిప్సీయువతి కలవరపాటుతో అటూ ఇటూ చూసింది. ఈమారు కంఠస్వరం పురుషునిది కాదు; స్త్రీది. అందరూ వెనుదిరిగి చూశారు.

"గోలండ్స్ టవర్ లో ముసిలి" అన్నారు తెలిసినవాళ్లు.

"రాత్రి తిండి దొరకలేదు కాబోలు."

అదును చూసుకుని కవి జారుకున్నాడు. తను కూడా రాత్రి పస్తు ఉన్నట్టు అతడికి గుర్తొచ్చింది.

"రొట్టె తెచ్చి పెడదాంరా ముసిల్దానికి" అంటూ పిల్లలు కొందరు పరుగారంభించారు. తనకూడా దొరుకుతుందనే ఆశతో కవి వాళ్ళ వెంటపడ్డాడు. కాని వాళ్ళు కుర్రవాళ్లు. వాళ్ళతో పరుగెత్తలేకపోయాడు కవి. కొంతదూరం వెళ్లిన తరవాత కుర్రవాళ్ళ జాడ కనిపించలేదు. నిస్పృహతో నిలబడిపోయాడు. రాత్రి చీకటివలె లేమి చుట్టూ అతడి నావరించింది. లేమి ఇంత క్రూరమైనదేమో, అనుకున్నాడు.

అసలు దేవుని కెవరిమీదనో కక్షపుట్టి ఈ మానవజాతిని సృష్టించాడని కవి ఊహించాడు. తత్వవేత్త జీవించినంతకాలం అతడి తత్వాన్ని నిర్జించడానికి నైమిత్తికాలు ముట్టడి చేస్తూనే వుంటాయి. గ్రింగ్వైర్ జీవితంలో ఇప్పుడు ముట్టడి నిజంగా దిగ్బంధంగా పరిణమించింది. ఇంత కఠిన పరీక్ష అతని కెన్నడూ తటస్థపడలేదు. ఆకలి అతణ్ని నిర్బంధించింది. ఉదాత్తమైన తత్వాన్ని జయించడానికి కడుపు తలపడ్డం అక్రమమన్నాడు కవి.

కవి ఆలోచనానిమగ్నుడైనాడు. ముసిరివచ్చిన యోచనలకు అకస్మాత్తుగా అంతరాయం కలిగింది. దాపులోనే మధురగీతం వినవచ్చింది. కవి ఆలోచనలనుంచి మేలుకొన్నాడు.

పాడుతున్నది జిప్సీ యువతి. ఆమె రూప సౌందర్యంవలె, నాట్యంవలెనే ఆమె కంఠధ్వని అవ్యక్త మధురం. మయూర క్రేంకారంవలె ఆ కంఠస్వరం ఆకాశవీధులలో తేలియాడుతున్నది. ఒక్కొక్కప్పుడు ఝరీపాతంవలె, ఒకొక్కప్పుడు గుసగుసలవలె, సర్పరోషావేశంవలె, మరొకప్పుడు సమతలమందు జలప్రవాహంవలె గానవైభవం శోభిల్లుతున్నది. మంజుల స్వనాలు, మృదుల మధుర పరుష స్వనాలతో ఆరోహణావరోహణక్రమాల నియమంలో శ్రావ్యము, అమలమైన ఆ సంగీత మాధుర్యం విని కవి తన్మయుడైనాడు. పాటలోని సొగసులతోపాటు ఆమె సుందర వదనం ఒకప్పుడు దివ్యావేశం, మరొకప్పుడు మహారాజ్ఞి దర్పం ప్రతిబింబిస్తున్నది.

పాటలోని భాష కవికి అపరిచితం. ఆ భాష ఆమెకైనా తెలుసునో లేదో తెలియదు. పాటలోని భావాలను ఆమె వ్యక్తీకరించకపోవచ్చును. కాని ఆమె పాడగా వింటున్న కవికి ఒక క్షణంలో ఉత్సాహం, మరొక క్షణంలో కరుణ, ఆపైన ఆనందం అనుభూతమౌతున్నాయి.

ఆ రాత్రివేళ నిర్జనమైన ఆ ప్రదేశంలో, విహంగంవలె నిశ్చింతగా ఉత్సాహంతో పాడుతూ వస్తున్న ఆ సుందరిని చూసేసరికి కవి ఆకలి మరచిపోయాడు. సర్వం మరచి పాట వింటున్నాడు.

ఇంతలో పాట ఆగిపోయింది. కటువైన దూషణ వాక్యాలు వినవచ్చాయి. "ఓసి మాయలాడీ! నీ మాయలింక కట్టిపెట్టు."

భోగి మంటలవద్ద నాట్యం ఆపుచేసిన వృద్ధవనిత కంఠం అది. జిప్సీయువతి ఆగిపోయింది. కవికి కోపం వచ్చింది. వృద్ధ వనిత నుద్దేశించి దూషించాడు: "శకునపక్షీ! నువ్వెక్కడ దాపురించావ్ ఇవాళ? ఎంత చక్కనిపాట!"

వెనుక సందడి వినవచ్చింది. భోగి మంటలవద్ద జనం ఇటు వస్తున్నారు. "ఈ ముసిల్దెక్కడనించొచ్చిందిరోయ్! తన్ని తగిలెయ్యండి." అని కొందరు కేకలు వేశారు. కొందరామెవెంట పడ్డారు. అంతలోనే అల్లంతదూరాన ఊరేగింపు కానవచ్చింది. వృద్ధవనిత ప్రాణాలు దక్కాయి. ఊరేగింపు కాగడాలతో పెద్ద వీధులన్నీ తిరిగి గ్రీవ్ చౌకువద్దకు వస్తున్నది. తిరిగితిరిగి వచ్చేసరికి ఊరేగింపులో జనం రెట్టింపయినారు. పారిస్ నగరంలోని బికారులు, యాచకులు, చోరులు, త్రాగుబోతులు అందరూ ఊరేగింపులో కలిశారు.

బికారిమూకల నాయకుడు ముందున్నాడు. ఒకడు గుర్రమెక్కాడు. రకరకాల చినిగిన దుస్తులు, కట్టు అలంకరణలతో జిప్సీలు స్త్రీ పురుషులు, పెద్దలు పిన్నలు అందరూ చేరి నడుస్తున్నారు. అందరూ అగౌరవదర్పంతో ఠీవిగా నడుస్తున్నారు. వంచకశ్రేష్ఠులు, చోరశిఖామణులు, హస్తలాఘవ ప్రవీణులు మొదలైనవారందరూ భీతి మరిచి స్వేచ్ఛగా వీధులలో విహరిస్తున్నారు. ఈ ఊరేగింపులో ఏ

---

ఎమ్. ఏ. లిటరేచర్ ఫస్టు క్లాసులో పాసయిన యువకుడు పెళ్లిచూపులకి వెళ్ళాడు. అతనితో పెళ్లికూతురు తండ్రి అన్నాడు:

"మా అమ్మాయి తెలుగు కవిత్వం అంటే చెవి కోసుకుంటుంది. పాతవాళ్లల్లో శ్రీనాథుడంటేనూ, ఇప్పటివాళ్లల్లో కృష్ణశాస్త్రి అంటేనూ ఆమెకిచాలా యిష్టం."

"అలాగాండి," అని ఆ యువకుడు లేని నవ్వు తెచ్చుకున్నాడు. తన వూరు వెళ్లాక యిలా ప్రత్యుత్తరం వ్రాశాడు.

"పరపురుషులమీద ఇంత యిష్టం కలిగిన మీ అమ్మాయిని పెళ్లిచేసుకోవడం భావ్యంకాదని మా అమ్మగారు అంటున్నారు. నేనుకూడా ఈ విషయంలో ఆమెతో ఏకీభవిస్తున్నాను."

---

వృత్తివర్గానికి ఎవరు నాయకుడో తెలియడం కష్టం. కాని, అన్ని వృత్తులవారూ కలిసికట్టుగా వ్యవహరిస్తున్నారనేది స్పష్టమే. వీరికొక చక్రవర్తి ఉంటాడు; రాజులుంటారు, సామంతులుంటారు, భటులుంటారు. నాయకులనంటి పరివారం ఉంటారు. అందరి మధ్యా, "సింహాసనం"పైన మూర్ఖాగ్రేసరుడు క్వాసిమోడో కూర్చుని ఊరేగుతున్నాడు.

ఊరేగింపులో చిత్రవిచిత్రాలైన వాద్యాలున్నాయి. జిప్సీల కంజిరాలు, తంబురాలు, ఆఫ్రికన్ల డప్పులు, కొమ్ముబూరాలు, పాతడబ్బాలు, రేకులు అన్నిరకాలూ పనికివచ్చాయి.

క్వాసిమోడో వికృతముఖంలో విలసిల్లిన గర్వం లేని వర్ణించనలవికాదు. అతడు జన్మలో ఆత్మాభిమానం, అహం చవిచూసినది ఇదే మొదటిసారి. ఇంతవరకు తన స్థితికి నిస్పృహ, తన రూపానికి జుగుప్స, ఆత్మనింద మాత్రమే అతనెరుగును. ఇతరుల నిరాదరణ, నిర్దాక్షిణ్యం మాత్రమే అతడికి అనుభవం. అందువల బధిరుడైనప్పటికీ ఇప్పుడతడు ప్రజల ప్రశంసలకు పొంగిపోతున్నాడు. ప్రశంసిస్తున్న ప్రజలు చోరులు వంచకులే కావచ్చు; అయినా అందరూ తన ఆధిక్యాన్ని అంగీకరించారు ఈరోజున. ప్రశంసలలోని అపహాస్యం, స్తోత్రాలలోని వ్యంగ్యదూషణలు అతడికి వినరావు. వారి ఉత్సాహమే అతడికి స్తోత్రపాఠం.

అతడి ఆకారమే కాదు, మేధస్సుకూడా వికృతి చెందింది. మేధస్సు కూడా బధిరమైనటుంది. అతడి ప్రస్తుతానుభూతి ఎటువంటిదో అతడికే బోధపడదు. ఏదో అవ్యక్తమైన ఉత్సాహం, ఆనందం మాత్రం అనుభూతమౌతున్నాయి. ఎప్పుడూ దైన్యం, దుఃఖం ఆవహించి ఉండే ఆ ముఖంలో, ఇప్పుడు ఆనందం వెల్లివిరుస్తోంది.

ఊరేగింపు వీధిమలుపు తిరుగుతోంది. హఠాత్తుగా ఒక వ్యక్తి గుంపులోనుండి తోసుకువచ్చి పల్లకీ ఎదుట నిలిచాడు. ఆ వ్యక్తి కోపంతో కుతకుతలాడిపోతున్నాడు. ఒక వంచకుని చేతిలో బికారి పతాకను గుంజి లాక్కున్నాడు. ఇతడికి బట్టతలఉంది. భోగిమంటలవద్ద జిప్సీయువతిని చూసి మంత్రకత్తె అని అనుమానించినవాడే. క్రైస్తవ మతాచార్యుని దుస్తులు ధరించాడు. గుంపులోనుంచి గ్రింగైర్ అతణ్ని గుర్తుపట్టాడు. "అరె! క్లాడ్ ఫ్రాలో! నాటర్ డామ్ చర్చి అధికారి ఇలా వచ్చారే!" అన్నాడు. ఫ్రాలో పల్లకీ నిలిపివేశాడు. గ్రింగైర్ భీతి చెందాడు: "ఇతని ఆయువు మూడింది! ఆ రాక్షసి నలిపి చంపేస్తాడు" అనుకున్నాడు.

క్వాసిమోడో పల్లకీ విడిచి లంఘించాడు. చుట్టూ అందరూ కెవ్వుమని అరిచారు. ఎట్టి అకృత్యం జరుగుతుందోనని భీతి చెంది స్త్రీలు ముఖాలు కప్పుకున్నారు. ఒక్క అంగలో క్వాసిమోడో మతాధికారిముందుకు వచ్చాడు. ఫ్రాలో ముఖంలోకి చూశాడు. వెంటనే మోకరిల్లాడు. శిరస్సు వంచుకున్నాడు. చేతులు జోడించాడు. ఫ్రాలో కోపావేశంతో పళ్ళు కొరికాడు. క్వాసిమోడో చలించలేదు. ఆపైన వారిద్దరి మధ్యా సంకేతాలతో మూగ సంభాషణ నడిచింది. ఇద్దరూ పెదవులు కదిపి మాటాడలేదు. ఫ్రాలో అధికారపూర్వకంగా ఆజ్ఞాపించాడు. క్వాసిమోడో వినయపూర్వకంగా అతడి భావాలను గ్రహిస్తున్నాడు.

చివరకు ఫ్రాలో సంజ్ఞలుచేయగా క్వాసిమోడో లేచి నిలిచాడు. ఫ్రాలో దారి తీశాడు, క్వాసిమోడో మౌనంగా అనుసరించాడు.

అవమానానికి లోనైన "మూర్ఖాగ్రేసరుని" కోసం మతాధికారితో తగవుకు సిద్ధమైనారు "మూర్ఖప్రజ". అందరూ ఫ్రాలోను చుట్టు ముట్టారు. కాని క్వాసిమోడో ప్రజల నడ్డగించి, మతాధికారికి రక్షకుడై నిలబడ్డాడు. ప్రజలు నిశ్చేష్టులైనారు. కోపావిష్టుడైన ఆ వికృతమానవుని చూసి ప్రజలు వెరపుచెంది తొలగిపోయారు. భీతి చెందిన ఫ్రాలో తిరిగి గంభీరభావంతో ముందు నడిచాడు.

వారిద్దరినీ కొద్దిమందిమాత్రం దూరదూరంగా అనుసరించారు. క్వాసిమోడో గిరుక్కున వెనక్కు తిరిగాడు. పళ్లు కొరుకుతూ మృగరాజువలె ఘూర్ణించాడు. అటుపైన ఇటు తిరిగే వెనుకగా నడువనారంభించాడు. కొంతసేపటికి ఇద్దరూ చీకటిలో కలిసిపోయారు.

"చిత్రంగా ఉన్నదే! అద్భుతంగా వుంది" అనుకున్నాడు కవి. కాని ఇంతలోనే జ్ఞప్తికి వచ్చింది. "అరె! మరి రొట్టె మాటేమిటి?" అని ప్రశ్నించుకున్నాడు! (ఇంకా వుంది)

# ప్రదక్షిణ

**రవికిరణ్ (సిక్కింస్టేట్)**

'దిలేరామ్! నారేషనుకూడా తెచ్చేవా యేం? ఈరోజు నేను విడుదల కావాలి' అని వచ్చీరాని నేపాలీ భాషలో అడిగాను.

"ఊఁ! హవల్దారుయిస్తే తెచ్చేను. నాకా సంగతే జ్ఞాపకంలేదు" అన్నాడు దిలేరాం. దిలేరాం జైలులో వంటవాడు. సిక్కిం స్టేటు జైలులో నా విడుదలనాటికి మొత్తం పదిహేనుమంది ఖయిదీలం వున్నాం. నేను ఖయిదులో కాలు పెట్టింది లగాయితు యీనాటివరకు ఖయిదీల సంఖ్య యిరవైకి హెచ్చనూలేదు; పదమూడుకి తగ్గనూలేదు. అందుచేత రోజూ రేషనులెక్కలు మామూలుగా వుంటూవుండేవి. అనూ (ఆస్మార్క్ లిప్చా) జైలులో 'ఓవర్‌సీర్'. పాపం అనూకి పధ్నాలుగుసంవత్సరాలు శిక్ష, దిలేరాంకి అయిదుసంవత్సరాలు. అబ్బ! ఎంత కషం. నాకుమాత్రం రెణ్నెల్ల పదిహేను రోజులూ రెండువందల సంవత్సరాలనిపించింది.

దిలేరాం యిచ్చిన సమాధానంతో గుండెల్లో దడ బయలుదేరింది. జైలరుమీద కోపమూ వచ్చింది. వీడి దుంపతెగా, యింకా నన్ను నిర్బంధంలో వుంచుతాడా యేం. మళ్ళీ రోజులు లెక్కపెట్టేను. పొరపాటేంలేదు. సరిగ్గా యీరోజే విడుదల దినం. మనసు ఒక్కసారిగా సత్యాగ్రహం వేపుకి మళ్లించేను. "నన్ను విడుదల చెయ్యకపోతే నువ్వేగతి సుమా!" అవును, మనస్సుని కూడా యిప్పుడే దిట్టపర్చుకోవాలి. జైలరుకాని విడుదల చెయ్యకపోయేడా, చచ్చేదాక సత్యాగ్రహం! ఢిల్లీదాక మనపేరు పరుగెత్తాలి; ఇలాంటి ఆలోచనలు యెన్నెన్నో మనసులోంచి బుర్రలోకి, బుర్రలోంచి మనసులోకి పరుగెత్తడం మొదలెట్టేయి. ఇంతలో గేటుదగ్గర తలుపులు తెరిచిన శబ్దం వినిపించింది. హవల్దారు గేటుముందు నిల్చుని కోర్టుకు హాజరు పెట్టవలసిన ఖయిదీల పేర్లు గట్టిగా అరిచేడు. "యేయ్! హాంసి; కుంజూటాసి - యిత్తా అయ్‌జా" (ఇలారండి)

మనసు తొందరపెట్టింది. నాపేరు పిలవలేదేం చెప్మా!...నాకాళ్లు నాకు తెలీకుండానే గేటు గుమ్మంవేపు నడిచేయి. "హవల్దార్ సాబ్, యీరోజు నేను విడుదలకావాలి" అన్నాను నేపాళంలో. హవల్దారు నోరు వెళ్లబెట్టేడు ఆశ్చర్యంగా. "ఆఁ! అప్పుడే అయిపోయిందీ! సరే, జైలరుతో చెప్పేస్తా" అని తలుపులు మూసేసేడు. మళ్లీ అయిదునిముషాల్లో తలుపులు తీసి "యేయ్! రవి, తయ్యార్ హోజావ్! ఘూటిమిలుచు" అన్నాడు.

వెనక్కి ఒక్క గంతువేసి వంటపంచ చేరుకున్నాను. వంటపంచలో దిలేరాం, అనూ కూర్చున్నారు. "అయితే తమ్ముడూ! వెళ్లిపోతానంటావా! దిలేరాం, గబగబా యిన్ని టీనీళ్లు మరిగించు! ఊఁ! గబగబా కాని" అని దిలేరాంను అనూ తొందరపెట్టేడు. నేను వంటపంచలోంచి నీళ్ళ పంపు వేపుదౌడు తీసేను. పంపుకింద బుర్రపెట్టి జుత్తు కొంచెంగా తడిపి, ముఖంకడిగేను. అక్కడనుంచి నాగది (సెల్)లోకి పరుగెత్తేను. ఇంక సర్కారుబట్టలు విడిచి నాబటలు కట్టుకోవాలి. ముందు రోజే నాబట్టలు వుతుక్కున్నాను. అంటే ఒక నిక్కరు, ఒక బనియను, సగం అల్లిక విడిపోయిన ఒకవూలు బనియను—నావిడుదల నాటికి నాకు మిగిలిన బటలు. యింతే. ఈ మూడింటిని వుతకటానికి—మాటవరసకి—సర్కారు సప్లయి నావంతు, అనూవంతు, దిలేరాంవంతు వచ్చిన సబ్బుముక్కలు చాలలేదంటే నమ్మండి. అంచేత ముఖం రుద్దుకోడానికి సబ్బుముక్క లేకపోయింది. సబ్బుముక్క లేకపోతే పోయింది; ఈ నాటితో శని విరగడైంది. ఈ రోజునుంచి బయట బాహాటంగా తిరుగుతాను. స్వేచ్ఛగా స్వచ్ఛమయిన గాలి పీల్చుకుంటాను. నాల్గుగోడలమధ్య యీ బ్రతుక్కి యీ నాటితో స్వస్తి. సరిగ్గా జ్ఞాపకం లేకపోయినా "యీనాడు తీరునే - యీ పంజర పు బ్రతుకు" అని చిన్న చిన్నగా పాడుకున్నాను. మళ్లీ ఆలోచనలో పడ్డాను. ఇంక ఒకటిరెండు గంటల్లో పచ్చికబీడులు చూడలేకపోయినా పచ్చని వృక్షాలు చూస్తాను. వెండికి. మల్లే ప్రవహిస్తూ, మీదపడే ప్రతి సూర్యకిరణాన్ని కళ్లల్లోకిచిమ్మే సెలయేళ్లను చూస్తాను. ఎంతసరదాగా వుంటుంది! హిమాలయాల దృశ్యాలు అతి మనోహరములు.

అబ్బ! యీ రెణ్నెల్ల పదిహేనురోజులు యెంతగడ్డుగా గడిచేయి! ఉదయం కాగానే రాత్రికోసం, రాత్రికాగానే వుదయంకోసం ఎదురుచూడవలసి వచ్చేది. గట్టిగా పచారుచేద్దామన్నా పదిగజాల పొడుగూ, పదిగజాల వెడల్పు కన్నా హెచ్చులేదు, జైలులోపలి విస్తీర్ణం. ఇందులోనే తూర్పువేపుమూల మరుగుదొడ్డి. కంపుకంపు. గోడాగొంది లేదాయె. గజం వెడల్పుటిన్ను రేకేగోడాయె. పగవాడికికూడా వద్దుయిటువంటి జైలుజీవితం! నా జీవితానికి సిక్కింసేటుజైలు బేసిక ట్రయినింగు స్కూలు. పాపం నా ఆంధ్ర సహోదరులు యీమాత్రం దానికోసం, సంవత్సరమో రెండు సంవత్సరాలో వృధా ప్రయాసపడి పైసా ఖర్చుచెసుకుంటూవుంటే, కానీ కర్చులేకుండా నేను ట్రయినింగు పూర్తి చేసేను!

"ఛ, ఛ, యిప్పుడు యిటువంటి ఆలోచనలన్నీ యేమిటి. సంతోషంగా బయటకు వెళ్ళాలి - విజయం పొందాలి." సర్కారు బటలు నీలిరంగు లాగు, మొండిచేతుల చొక్కా యిప్పేసి నా నిక్కరు బనియను తొడుక్కున్నాను. స్వెటరు మాత్రం ఎండలో వేసేను. మళీ వంటపంచలోకి పరుగెత్తేను. "తయ్యారయ్యే నోహో!" అని గట్టిగా కేకపెట్టేను. దిలేరామ్ నాకిచ్చిన సిలవరుచిప్పలో టీ నీళ్లు - డికాషను పోసేడు. దీన్నే నేపాలీలో 'రంగ్' అంటారు. నేను జైలులో కాలుపెట్టింది మొదలు యీ 'రంగ్' త్రాగటానికి అలవాటుపడ్డాను. ఇందులో యిష్టంవుంటే వుప్పుతో, లేకపోతే అలాగే గుటకరించటం అందరికీ (ఖయిదీలందరికి) పరిపాటి. ఇంటిదగ్గర అమ్మ ఎప్పుడన్నా టీ పెట్టిందంటే, సమయాసమయాల్లో కాఫీగుండ లేనప్పుడు, గ్లాసు విసిరికొట్టేవాడిని. ఏమయినా సరే నాకు కాఫీగాని గిట్టదనేవాడిని. 'సమయం వస్తే వసుదేవుడు గాడిదకాళ్లు పట్టేట్టు' అదంతా యెందుకు? మొదటిరోజున నేను జైల్లో కాలుపెట్టగానే నాల్గోగం టయేటప్పటికి ఒకటోకు జొన్నలు వేయించి యిచ్చేరు. చిప్పలో రంగ్ కూడా యింత పోసేరు. అది ఆ రాత్రికి నా భోజనమన్నమాట. ఆనాడు నాకు అరికాలిమంట నెత్తికెక్కింది. తొలిరోజు అందరికీ ఇదేవిధంగా

యిస్తారు. ఇదేం ఖర్మ గుర్రాల దాణా యిస్తారేం చెప్మా? ఈ టీ డికాషనేమిటి, వీళ్లంతా అన్నం తింటూ నాకు జొన్నలు యియ్యటమేమిటి, అంతా కలగా వుందే! వెంటనే మహాకవి శ్రీనాథుడు జ్ఞాపకం వచ్చేడు. ఈ జొన్నకూడు, జొన్నంబలి తినలేక రాయలసీమని తిట్టిపోసేడు. గరళ కంఠునికూడా పందెంలోకి దింపేడు. గరళాన్ని మింగలేక ఈశ్వరుడు గొంతులోనే వుంచీసేడుట. ఈ యిద్దరిలో యే వొక్కరూ కూడా 'రంగ్' ప్రభావం యెరుగరు నేనుమాత్రం యీ రెంటి రుచికి గురికావలసి వచ్చింది. పద్యాలు చెప్పటం రాదుగాని లేకుంటే శ్రీనాథు డేమూల? మొత్తానికి యీ రంగ్ తెలుగు కవుల అనుభవంలోకి ,తేబడ లేదనుకుంటాను.

"ఇంకెంతోసేపు లేదు. ఒకటి రెండు గంటల్లో యీ యెత్తుగోడలు దాటి వెళ్లిపోతావులే; నువ్వు రోజులు లెక్కవేసేవు, మేం సంవత్సరాలు లెక్క వేస్తున్నాం." అని మెల్లిగా నిస్సారంగా గొణిగేడు అనూ. అవును, అనూ కష్టం నాకిప్పుడు గుర్తుకు వచ్చింది. నేను రెణ్ణాళ్లకే విసుగెత్తిపోయేను. రోజూ బంగాళాదుంపల కూర; ఉప్పుడు బియ్యం అన్నం. చప్పగా యెంత కని తిని యేవటం? వీళ్ళ రేషను తగులడ్డట్టేవుంది. మెల్లిగా ఒక పిటీషను రాసి పారేసేనేగాని...పాపం ఖయిదీలకి యెంత కష్టం! నాకేగాని నేపాళ మాంత్రికుని మంత్రం వస్తేనా! జైలునే అమాంతంగా మాయం చేసేవాడిని! అబ్బబ్బ! నన్ను యెంత కష్టపెట్టేరు. కప్పుకుందికి యిచ్చేరా? పరుచుకుందుకు ఇచ్చేరా? జైల్లో ప్రతి ఖయిదీకి రెండేసి కంబళ్లు యివ్వాలన్న నియమం వుంటే, వీళ్ళ ముల్లేం పోయింది? అధమం ఒక్క కంబళీ కూడా యిచ్చేరు కాదు. సర్కారు సప్లయి చేసింది గూడా యివ్వటానికి వీళ్ళ మనసొప్పదు. 'దేముడు వరమిచ్చినా పూజారి యివ్వడట' అందులోనూ ఖయిదీలకియ్యటానికి. ఖయిదులో - నాలుగోడల మధ్య ప్రపంచానికి కనుపించకుండా యిరుకు గదుల్లో పెట్టి తాళాలు బిగిస్తారు. కడుపు నిండా తిండి పెట్టరు. రుచికరమైన పదార్థాలు తినటానికి నోరూరితేమాత్రం ఎలా వస్తాయి? చప్పగా యీ బంగాళాదుంపలు! యేమిట్లో ఖర్మం. నేను ఆంధ్రుణ్ణి కదా. మిరపకాయ కారం తెగతినవలసినవాడిని! దేశంవెళ్లి చింతకాయ పులుసు, గోంగూర పచ్చడి తెగతెనాలి! అధమం తలకి నూనె గూడా యియ్యరు. బ్రహ్మ రెండే రెండు చేతులు యిస్తే తుప్పబుర్ర గోక్కునేదెట్లా? ప్రపంచంలో పేలన్నీ సిక్కిం జైలులో ప్రవాసం చేస్తున్నాయేమో! నా ఒక్కడి పాపం గాదు. అందరికీ అంతే. జైలులో కాలు పెట్టేడా అంటే—ఉకారాంతః స్త్రీ లింగో (స్త్రీ లింగంలోకి చేరుస్తున్నాను) పేను శబ్దః-పేను, పేనుః... పేనూ పేన్వః అని శబ్దాలు నేర్చుకోవాలి తన

శరీరం అంతా ప్రేమమయం కావాలి. పగలల్లా యెక్కడ దాక్కుంటామో కాని రాత్రి 'సెల్'లోకి పడుక్కుందికి వెళ్ళేమా, చచ్చేమన్న మాటే. ఇంతమంది కాంగ్రెసు సత్యాగ్రహులు జైళ్ళలో వున్నారు కాని— సిక్కు జైలులో వుంటే సత్తా తెలిసేది!— యీ అనుభవం వాళ్ళకి లేదనుకుంటాను. ఒకవేళ అటువంటిదే తటస్థిస్తే "జన్మలో మరి జైలుకి వెళ్ళం" అని ఒట్టు పెట్టుకునేవారేమో?

పైసాపరక జీవితంలో ధర్మం చెయ్యక పోయినా శిబిచక్రవర్తికి మల్లే ఖైదీ రుధిర ధర్మం చేస్తాడు. శిబిని మమ్మల్ని సరిపోల్చి చూస్తే— శిబి జీవితంలో ఒకేమారు కండపల్ని కోసియిచ్చేడు; మేము అనునిత్యం మా రక్తాన్ని యిస్తున్నాం. శిబి కత్తితో కోసుకుని ఒకేసారి నొప్పుకున్నాడు, మేము ప్రతి రాత్రి పేను కొట్లకు...శిబి ఒక్క పక్షికి మాత్రం తన మాంసాన్ని యిచ్చేడు. మేమో వందలాది పేలకు మా రుధిరాన్ని యిస్తున్నాం. శిబి ఒక్కడే ధర్మాత్ముడు కాడు. సిక్కు జైలు రిజిష్టర్ ప్రకారం మేమందరం శిబిచక్రవర్తి కన్నా మిన్నలమనిపించుకున్నాం. సిక్కు జైలు యీనాటివరకూ ఎంతమందిని నిర్బంధించిందో అంతమందినీ 'అపరశిబులు' అని పిలవ్వలసివస్తుంది.

యిదెక్కడి పేల సంసారం! భగవంతుడా! 'పైడ్ పైపర్ ఆఫ్ హేమిలన్' యీనాడు బ్రతికివుంటే అమాంతంగా కాళ్ళమీదపడి "పైడ్ పైపర్! నీ బాకా వూది యీ పేలను యెక్కడికన్నా తీసుకుపో బ్రదర్" అని మొర పెట్టుకునేవాడిని.

సరిగ్గా జ్ఞాపకం లేకపోయినా ఒక మహానుభావుడు రచించిన వ్యాసం—ఒక మన్మథ వర్తి పెళ్ళివార్ని గురించి వర్ణించటం—అది నిజమే కావచ్చు, కాకపోనూవచ్చు. ఇది మాత్రం నా జీవితంలో అక్షరాలా అనుభవించిన యితివృత్తం. పడుక్కోవటానికి భూతలశయనం, కప్పుకుందికి జైలు పైకప్పే, చింపిరితల, పేలసంసారం. ఆంధ్రుల పెద్దలు అనుభవజ్ఞులు.

దీనితో సరిపోయిందీ! ఈ పేలబాధ భరించలేక—భరించక తప్పదనుకొండి— జుట్టు మొదలంటా గొరిగించేసేను. జుట్టంటే కత్తిరింపించేనుగాని గడ్డమో? దీనికి రెండో సాధనం లేదు. మళ్ళీ జైలరుతో మొర పెట్టుకోవాలి, బ్లేడుకోసం. "నీవే తప్ప నితఃపరం బెరుగ... సంరక్షించు భద్రాత్మకా" అని పొంగ వేస్తే వారం పదిరోజుల తర్వాత ఒక బ్లేడు విసిరికొడతాడు. ఆత్మకు యింత కష్టం ఎందుకు కల్గజెయ్యాలి! అంచేత గడ్డం అలా వుంచెయ్యటమే. నేను ఒక వేదాంతిగా తయారవుతానేమో? గడ్డం పెంచటంకూడా సరదా అనిపించింది. చాలామంది నవీన బెంగాలీ యువకులు జ్ఞాపకం వచ్చేరు. ఆ తర్వాత రవీంద్రుడు, బెర్నార్డ్ షా, టాల్‌స్టాయి, మార్క్స్, లెనిన్ మున్నగు మహానుభావుల గెడ్డాలను స్ఫురణకి తెచ్చుకున్నాను. అంతటి మహానుభావులకు గెడ్డం ఒక అలంకరణ అయినప్పుడు, మనకిమాత్రం యెందుకు కాకూడదు? ఈవిధంగా మనసుని సముదాయించుకుని తృప్తిపడ్డాను.

గత్యంతరం లేదు. సమయానుకూలంగా కాలం గడపాలి. 'నొప్పించక...తానొవ్వక' అన్నాడో కవి. నిజానికి కవిత్వం నాకబ్బలేదుగాని లేకుంటే శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు యేమూల? శతసహస్రాలుగా సిక్కు జైలుమీద పద్యాలు రాసివుండేవాడిని. పూజ్యులు కీర్తిశేషులు శ్రీ పానుగంటి లక్ష్మీనృసింహారావుగారు యిటువంటి జైళ్ళమీద తమ విసురు చూపలేదెందుచేతో! (నేను సాక్షి అన్నిభాగాలు పూర్తిగా చదవలేదు.) అలా ఒకవేళ ఆయన కలం జైళ్ళమీదకూడా చిందులు త్రొక్కివుంటే, ఆయనకు రెండు చేతులు ఎత్తి నమస్కరిస్తాను.

పురాణేతిహాసాలు జ్ఞాపకానికి వచ్చేయి. చచ్చిన తర్వాత జీవుడిని యమదూతలు యమపట్నం చేరుస్తారట. అక్కడ న్యాయమూర్తి పాపులకు దండన విధిస్తాడు. ఇది నిజమో కాదో తెలియదు. నేనుమాత్రం అటువంటి దండనల్ని సిక్కు జైలులో అనుభవించాను. ఒకవేళ నేను చచ్చిన తర్వాత యమలోకం వెళ్లనక్కర్లేదేమో!

ఈరోజు నాకు పర్వదినం. నన్ను విడుదల చేస్తారు, మహానరకకూపంలోంచి ఇంక కొన్ని నిముషాల్లో బయటపడతాను. ఈ యెత్తుగోడల బయట నిలుచుంటాను. ఈ జైలుకి గుడ్ బై కొట్టేస్తా. మరెప్పుడూ వద్దు యీ జైలు నివాసం.

ఇంతలో గేటుతలుపు తీసి హావల్దారు "రబి యిత్తా ఆయ్‌జా"! అని కేక పెట్టేడు. అనూ దిలేరాంలు గేటుదాకా సాగనంపేరు. గేటులోంచి ఆఫీసులోకి గెంతు వేసేను. దిలేరాం నా స్వెటరు తీసుకువచ్చి యిచ్చేడు. జైలరు కాగితాలమీద యేదో గొలికి సెంట్రీకి యిస్తూ; "ఇతనితో కోర్టుకు వెళ్లు, అక్కడనుంచి నీకు విడుదల-ఇది దస్తూరు" అన్నాడు. సెంట్రీ వీధిగేటు తలుపులు తీసేడు. బయటకి నడిచి నాల్గువేపులా కలయచూసేను. గట్టిగా గాలి

"మీ అబ్బాయిని అంత ఎత్తు మంచంమీద పడుకో పెట్టా రేమిటండీ?"

"ఆ, ఏంలేదు, కిందపడితే వెంటనే తెలుస్తుంది గదా, అందుకని."

పీలుస్తూ 'ఇక్కడే వుండు, జైలుగోడ చుట్టి వస్తా' అని సెంట్రీతో చెప్పి జైలుగోడల చుట్టూ పరుగెత్తేను. మళ్ళీ అయిదు నిముషాల్లో సెంట్రీ నిలబడ్డచోటుకి వచ్చేను. జైలరు హావల్దారు ఖంగారుగా బయటకు వచ్చేరు. 'ఇదంతా యేమిటి రబి?' అని జైలరు అడిగేడు. 'ఏమీ లేదు సార్' అంటూ "ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి" అని జైలుగోడలకి నమస్కరించేను. "మరేం లేదుసార్ మరెప్పుడు యిటువంటి జైలు జీవితం వద్దని, మళ్ళీ నన్ను ఇక్కడకు పిలవవద్దని యీ జైలు గోడలకు నమస్కారాలు సార్."

జైలరూ, హావల్దారు విరగబడి నవ్వేరు. నేనుమాత్రం చలించకుండా యిలా అనుకున్నాను. జాంబవంతుడు రోజూ భూమిని చుట్టి వచ్చేవాడట. కాని భూప్రదక్షిణ చేయలేని మన పూర్వులు (మన కాలంలో కూడ) గోప్రదక్షిణాలు చేసేరు, చేస్తున్నారు. అందరూ పుణ్యార్జనకోసం ప్రదక్షిణాలు చేస్తే నేను విముక్తికి చేసేను!! "ఆహా సిక్కుం జైలా! భక్తి శ్రద్ధలతో, నీ మహిమకు వెరచి తుదకై, అంజలి ఘటించి ప్రదక్షిణ సల్పితిని. ఇక సెలవు." అంటూ సెంట్రీ వెనకాలే కోర్టువేపు నడిచేను. ★

# ★ చిరంజీవి ★

పోయిందాకా వదలడు. అతనికి ఆటలరంధి పోత్తుగా పోయింది. పుస్తకాలంటే అమ్మా, నాన్నా, అన్నం కవళం అయిపోయినై శ్రీహరి, సత్యం, వాళ్ల చెల్లెలు కాముడు - తనను పలకరించి ఆడుకోటం లేదన్న దిగులు అసలు లేదిప్పుడు.

## 2

చిరంజీవిని వాళ్ళ మామయ్య వచ్చి తోడుబెట్టుకు పోయినాడు. ఇకనుంచీ అక్కడే చదువుకోవాలని అమ్మ చెప్పింది

మామయ్యగారి వూళ్ళో చిరంజీవి నెఱిగిన పిల్ల లెవ్వరూ లేరు. మామయ్యగారి పిల్ల లిద్దరూ పారాడే పాప, యింకొక ఆడపిల్ల తన యీడువాళ్లు గాదు. అక్కడ గూడా చిరంజీవి బడినుంచి రాగానే పుస్తకం ముందేసుకు కూచునేవాడు.

అత్తయ్యవచ్చి - "అదేమిట్రా, ముచ్చకోనంగాలె. ఎప్పుడూ పుస్తకాలేనా? సాయంత్రంపూట అట్లా దేవుడిగుడికళ్లే వెళ్ళి ఆడుకోలేవూ?" అన్నది

చిరంజీవి పుస్తకం కిటికీలో మూసిపెట్టి దేవాలయంవేపు వెళ్ళాడు. అక్కడ పిల్లలు కోలాహలంగా ఆడుతున్నారు. దేవాలయానికి ముందు ప్రహరీగోడతో కలిసి ఐదంతస్థుల గాలిగోపురం గూడా వున్నది. వాళ్ల వూళ్లో చివర గుడికి గోపురంగూడా లేదు.

కొత్తపిల్లవాణ్ణిచూడగానే, వూళ్లోపిల్లలు చాలామంది అతనివంకే చూశారు. కొందరు చూసి తిరిగి ఆటల్లోకి పోయారు. కాని యిద్దరు ముగ్గురు మగపిల్లలూ, ఒక ఆడపిల్లా చిరంజీవిముందే నిలబడ్డారు - తన ముఖం మీద కోతులు ఆడుతున్నట్టుగా.

అందులో ఒక లావుపాటి పిల్లవాడు కొంచెం యికిలించి, పళ్ళు బయటబెట్టి -

"ఎవ్రోవ్ ఈకొత్తఘటం,రంగాయ్" అని రంగాయ్‌వంక చూశాడు.

"పద్మనాభంగారింటికొచ్చాడ్రా" అని అందులో ఆడపిల్ల మాట అందించింది.

రంగాయ్ వూరుకోలేదు - "అరే యిశివుడూ, యీయన పెద్ద పుస్తకాలపండితుడ్రా. వాళ్ళత్త అమ్మతో అంటున్నది. పుస్తకాలు చదవటం తప్పితే యింకేమీ రాదుట్రా"

లావాటి శివనారాయణకు యీమాటల్తో బాగా నవ్వు వచ్చింది. "వట్టి పప్పుసుద్దన్న మాట" అన్నాడు చిరంజీవి ముఖంలో ముఖం పెట్టి.

ఆడపిల్ల నవ్వింది.

చిరంజీవి ఆ ముగ్గురివంకా తీవ్రంగా చూశాడు. వీళ్ళు పిల్లలు గాదు, తిరుపతి కోతులు. తిరుపతి కోతులుగూడా గాదు, యమకింకరులు. ఒర్రిపుణ్యానికి తన నేడిపించ జూస్తున్నారు అతనికి బక్కకోపం వచ్చింది.

"నీకన్నా నయమేలే నీమాదిరి బండను గాదులే" అని లావుగా అడ్డంగా బలిసిన శివనారాయణ నన్నాడు, కళ్ళల్లో కళ్ళు పెట్టిచూసి.

లావాటి కుర్రవాడు చిరంజీవి చెంప మీద ఛెళ్లున కొట్టాడు. కొట్టి అక్కడ వుండలేదు. కాలికి బుద్ధిచెప్పి, ప్రహరీగోడ కన్నాల్లో కాళ్ళుదూర్చి, మెట్లుచేసుకొని, గాలిగోపురంమీదికి రివ్వున ఎక్కాడు, పకపకానవ్వుతూ. వాడితోపాటురంగాయ్, ఆడపిల్లగూడా పరుగెత్తిపోయారు.

చిరంజీవి కళ్లనిండా గిర్రున నీళ్ళు తిరిగినవి. చెంపకుచేయిరాచిచూచుకొన్నాడు కోపంతో, తనూ ప్రహరీగోడ ఎక్కబోయినాడు. కాని అలుపువచ్చి కిందబడ్డాడు.

*　　*　　*

ఇంటికి వెళ్ళింతర్వాత అత్తయ్య అన్నది. "వట్టినాప. పుస్తకాలకు తప్పితే మరింకెందుకూ పనికిరాడు. బ్రహ్మాజమానం. ఇంత చవటవు రేపు నువ్వు చదివి చెయ్యబోయే ఘనకార్యం ఏమిటో కాస్త చెప్పుదూ?"



అత్తయ్య తప్పంతా చిరంజీవిమీదనే తేల్చింది. ఆమె కన్నకడుపుగాదు చిరంజీవి.

## 3

చిరంజీవికి జ్వరం వచ్చిందని వాళ్ల మామయ్య అమ్మకు వుత్తరం రాశాడు అమ్మవచ్చి చిరంజీవిని తీసుకుపోయింది. వాళ్లవూరు చేరగానే చిరంజీవికి జ్వరం పోయింది, ఎక్కడకు పోయిందోగాని

ఆరోజున చిరంజీవి ఆవకాయ వేసుకు తిన్నాడు.

*    *    *

మామయ్యగారి వూళ్లో జరిగిన అవమానం చిరంజీవి మరిచిపోలేకపోయినాడు తలచినకొద్దీ వళ్లు మండింది కళ్ళనీళ్లు వచ్చినవి. చీకట్లో ఏడ్చి చిరంజీవి ఆసంగతి అమ్మకు చెప్పటానికిగూడా సిగ్గుపడ్డాడు.

ఆరోజునుంచి చిరంజీవికి పుస్తకాల పిచ్చిపోయింది—అంటే బళ్లోకి పోవటం లేదని గాదు. బళ్లోపాఠాలు చదవటంవరకే ఇంటికొస్తే ఆటలధ్యాసే తను బ్రభాజమానం కాదని నిరూపించుకోటం ఎట్లా మరి?

చిరంజీవిలో వచ్చిన మార్పును చూచి అమ్మ ఆశ్చర్యపడ్డది కాని ఆమె ఏమీ అనలేదు తిరిగి శ్రీహరి, సత్యం, కాముడుతో కలిసి—చిరంజీవి ఆడుకోటంచూసి ఆమె సంతోషించింది.

## 4

ఏడేళ్ళు గడిచినవి చిరంజీవి పెద్దవాడైనాడు. ఎట్లా! బక్కకోనంగిగా గాదు దద్దోజనం ముద్దగాగాదు బ్రభాజమానంగా అసలు కాదు. ఉక్కుకడ్డీగా, నిటారుగా పెద్దవాడైనాడు తాలింఖానాల్లో పోత బోసిన కొత్త ఉక్కు అలనివళ్ళు అడవిమానులాగా అతనికి ఛాతీవచ్చింది

చిరంజీవికి డ్రిల్లుమాష్టరు వుద్యోగం, ఆర్డర్లూ వచ్చినవి.

"అమ్మా, నేను వుద్యోగంలో చేరబోయేముందు మామయ్యగారి వూరు వెళ్లోస్తా. నాకొంచెం పనుంది" అన్నాడు చిరంజీవి అనటమేగాదు, ఉన్నపాటున బయలుదేరాడు. తల్లి నవ్వుకొన్నది.

మామయ్య అల్లుడికండరాలు పట్టచూచి—"ఏమిరా మిలటరీ వాడా" అని నవ్వుకొన్నాడు. అత్తయ్య కూతురు నివ్వాలని చిరంజీవికి అల్లుడి మర్యాదలు చేసింది "మామయ్యా, శివనారాయణ అనే అబ్బాయుండాలే మీ వూళ్ళో; వున్నాడా యింకా?" అని మామయ్య నడిగాడు, కాళ్ళు కడుక్కొగానే

"ఏం వుంపెకేం? నిక్షేపంవంటి బిడ్డరా వాడి చదువేమో, సంగతేమో యితర్ల జోలికి పోడు. పెద్దపరీక్షలకు చదువుతున్నాళ్ళే."

చిరంజీవి, మామవంకచూసి శివనారాయణ యింటవైపు బయలుదేరాడు అరుగుమీద కూర్చొన్న శివుణ్ణి, చిరంజీవి సులభంగానే గుర్తుపట్టినాడు.

"నీతో కొంచెం పనున్నది. దేవాలయందాకా వస్తావా?" అని ఏకవచనంలోనే శివుణ్ణి పిలిచాడు.

శివనారాయణ కొంచెం సంబాళించుకొని "క్షమించాలి. మిమ్మల్ని గుర్తుపట్టలేదు" అన్నాడు.

"ఆ సంగతికే; ఆ సంగతికే మాట్లాడాలి" అని చిరంజీవి దారితీశాడు

దేవాలయంముందు, సాయంత్రం ఎండ మాత్రమే వున్నది. చిరంజీవి, శివనారాయణను కిందనిలిపి, పిల్ల సింహంవలె దూకి ప్రహరీగోడమీదుగా గాలిగోపురానికి లంఘించాడు. ఆశ్చర్యంతో శివుడు యిదంతా పరికిస్తూ నిల్చుండిపోయాడు ఎంత వేగంగా వెళ్ళాడో, అంత వేగంగా చిరంజీవి గోపురం దిగివచ్చి, శివుడిముందు నిటారుగా నిలబడ్డాడు.

"జ్ఞాపకముందా; ఏడేళ్ళకిందట? నేను పద్మనాభం మామగారింట్లో చదువుకోటానికి వచ్చినప్పటిసంగతి, నువ్వు వత్తి పుణ్యానికే నన్ను చెంపదెబ్బకొట్టి పారిపోయినసంగతి, పాతవిషయంలే"

శివనారాయణ నోరువిప్పి, యీ కొత్త యువకుడివంక చూశాడు

"మీరేమంటున్నారో నాకు అర్థం కావటంలేదు - " అనబోయాడు.

"ఎందు కర్థమవుతుందీ? అవును పోరుగూరి పిల్లవాణ్ణి పప్పుసుద్దని ఎగతాళి చెయ్యటం కాదుగా యిది ఇదిగో విను, నే నొచ్చిన విషయం యిదీ. దెబ్బకు దెబ్బ తీర్చుకుందామని వచ్చాను నే నిప్పుడు పుస్తకాల పండితుణ్ణి కాదని నీకు రుజువు చేసి వెళ్తా నీ యిష్టం; నీ కేవిధంగా కుస్తీకి రావాలని ఉన్నదో ఆలోచించుకో."

చిరంజీవి వుద్రేకంగా గబగబా అనేశాడు యీ మాటలు

శివుడు తగ్గినట్లుగా కనబడలేదు కాని నెమ్మదిగా చెప్పాడు.

"మీరు చెప్పేది యింకా నేను జ్ఞప్తి తెచ్చుకోలేకుండా వున్నాను. అయినా మీరు పెద్దమనుషులుగా కనబడుతున్నారు. మీతో కుస్తీపట్లు నా కిష్టంలేదు కాని మీ కొకావలిసింది ఒక్క చెంపదెబ్బేనని నా వుద్దేశ్యం. అట్లా అయితే, యిదిగో నా చెంప మీ యిష్టం వచ్చినంత బలంగా కొట్టవచ్చు ఆ తర్వాత యింకా కుస్తీపట్టాలనివుంటే చూద్దాం" అని ఒక చెంప ముందుకిచ్చి నుంచున్నాడు.

చిరంజీవి ఆ చెంపవంక, ఆ చెంప నిచ్చిన శివునివంకా చూశాడు మొదట చెయ్యి లేచింది. కాని అప్రయత్నంగానే దిగిపోయింది

చీకట్లో అతను యింటిముఖంపట్టి:

"మీరూ పెద్దమనుషులుగా మారినట్లు తోస్తున్నది మిమ్మల్ని కొట్టటం యిక యిష్టంలేదు" అన్నాడు - అని ఫక్కున నవ్వాడు. ఆ నవ్వులో శివనారాయణ నవ్వు గూడా కలిసింది ఇద్దరూ చెట్టాపట్టాల్ వేసుకొని పద్మనాభంగారింటిదాకా వెళ్ళారు.

అక్కడే అత్తయ్య, మామయ్య, మామయ్య పెద్దకూతురు సీతా వరండాలో కూచొని చిరంజీవి ముచ్చటే చెప్పుకొంటున్నారు

శివనారాయణ ముందు వచ్చి—

"ఏమండీ, మీ చిరంజీవి చాలా గడుసువాడు లాగా కన్పిస్తున్నాడు పెళ్లి ఎప్పుడు చేద్దామంటారో కొంచెం చెప్పండి" అని అడిగాడు,

పద్మనాభంగారు నవ్వుకొని—

"మావాడు చూశావుటోయ్, మిలటరీ అనుకో పక్కా మిలటరీ" అని విరగబడ్డాడు.

సీత అందుకొని "మిలరీ ఏమిటినాన్నా! బావ డ్రిల్లుమాష్ట రయితేను" అని తుర్రున లోపలికి పరుగెత్తింది

"అత్తయ్య నన్ను చదివి చెయ్యమన్న ఘనకార్యం యిదే కాబోలు మామయ్యా" అని అందరితోనూ కలిశాడు మాజీ బ్రభాజమానం, డ్రిల్లు చిరంజీవి - లోపలికి పారిపోయిన సీత వేపు వేలు చూపుతూ. ★

# ★ భాగస్వాములు ★

## భాస్కరం, ప్రభాకరం

"బాబూ! జట్కా కట్టనా?"
"........"
"బాబుగోరూ! జట్కా కట్టనా?"
".. ........"
"ఛారి ఈ అయ్యాలంతా ఎంతోరురా! బండికట్టనా బాబూ అని గోలెడుతూంటే - ఒద్దని సెప్పడానికే టైం నేదురా! అవుస్లే యిప్పుడెందుకో త్తిడీ యీళ్ళ కవసరం -" అంటూ జట్కావాడు, అప్పుడు ఒక్కసారి ఎందుకో తెలియని బాధపడ్డాడు. నిజమే! అన్నిసార్లుబాబూ అని అరిచినా చివరికి 'ఒద్దు' అనేమాట వినే భాగ్యానికైనా నోచుకోని వారు ఎవరైనా అల్లా అనుకుంటారు

"ఒరే! ఒక బీడీ ఈరా! యెంకన్నా' పక్కనున్న వెంకన్నని అడక్కడక్క అదే మొదటిసారిగా అప్పన్న అడిగాడు.

"నేదురా!" అంటూ బీడీ పారేస్తూ వెంకన్న మెల్లిగా లేచాడు

"అరె! నిజంగా!" ఆశ్చర్యపోతూ అడిగాడు అప్పన్న

"నీతోడు!" వెంటనే ఆలోచించనక్కర్లేకుండా, తయారుగా ఉన్నమాటను అనేశాడు వెంకన్న.

తెరిచిన నోరు తెరిచినట్లే ఉంది అప్పన్నకు అంతకుముందే చూశాడాయె తను, వెంకన్న బీడీ కట్టలోంచి తీసుకు బీడీ కాల్చడం. అప్పటికప్పుడే లేదన్నాడు. దుంపతెగ! ఎంత అన్యాయం! లోకమంటే యింతేగామోసు. ఎన్నిసార్లో తనదగ్గర తీసుకున్నాడే వెంకన్న! అంతమాత్రం కృతజ్ఞతైనా లేకపోయిందా!

అప్పన్న లేచిన వేళావిశేషం ఏమిటోగాని ఆరోజు బేరమన్నమాటలేదు. పొద్దుట్నుంచి ఒక బేగోడవగా అడుగుతున్నాడం దర్నీ కాని-ఎవ్వరూ ఎక్క లేదు తనబండిలో. ఎన్నిసార్లో అనుకున్నాడు తను సింహాద్రి (గుర్రం)ని అడుగుదామని కాని మరుక్షణంలోనే ఏదో బేరం వస్తున్నట్లుండటం, మానడం జరిగింది దానితరవాత మరిచిపోవడం జరిగింది

అప్పన్న ఎప్పుడైనా బేరాల్లేకపోతే సింహాద్రినిఅడుగుతాడు. "సింహాద్రప్పన్నా-కనికరం లేదా ఈయాళ"అని తన సింహాద్రి తలూపినప్పుడల్లా మంచిబేరం ఒకటో, రెండో కట్టేశాడు. దాంతో సరి సింహాద్రి గూడా, మంచిదే ఎప్పుడైనా అవసరం వస్తే తను వళ్ళొంచి, పిక్కబలం చూపిస్తోంది. పేరుకి అప్పన్న బండీ ఛేషయినదే! కాని బేరానికిమాత్రం బరువైంది!

బీడీముక్క రామయ్యదగ్గర ఎరువుతీసుకు కాలుస్తూన్న అప్పన్నకి ఎదురుగా ఉన్న సింహాద్రినిమా సేప్పటకి ఆలోచన తట్టింది. బీడీ పారేసి సింహాద్రి చెవుదగ్గరికెళ్ళి, చేతులు జోడించి

"సింహాద్రప్పన్నా - కనికరం లేదా ఈయాళ" అన్నాడు మెల్లిగా. 'విన్నానోయ్' - అన్నట్లు వెంటనే తలూపింది సింహాద్రి. "భలేదొర! భలే" అంటూ అరిచాడు అప్పన్న, బేరం వస్తుందన్ననమ్మకం కుదిరి.

అల్లాకూర్చున్న అప్పన్నకి గంటన్నర

భంలో ఆరుకనిపించింది చీకటిపడుతోంది బేరం ఏంలేదు. ఆంధ్రసిటీలో చీకటిపడ్డాక బేరాలే ఉండవు పోనీ అనుకుందామంటే అవి శెలవలు! ఎవ్వడొస్తాడు టవున్కి. సింహాద్రి కొప్పిందంతా అబద్ధమయిపోయింది బేరాలు లేకపోతే పాయె కూడబెట్టిన డబ్బేమైనా ఉందా అంటే అదీలేదు! రాత్రికి అప్పులడగాలాయె! ఆకోటు ఆసామీ ఓ దరిద్రుడు అప్పిమ్మంటే సాగదీయగా సాగదీయగా యిస్తాడు. ఏదో కొద్ది యింతచేసినా చివరికి ఆరాత్రంతా మర్నాడు పగలూ అంతా పుత్తిగా ఉండాలె! ఏం చేస్తాడు 'సింహాద్రప్పన్న యివ్వాళ్ల మోసం చేశాడు' అనుకునే ఉన్నట్టున్నాడు.

ఆరున్నరయ్యింది. యింక లాభంలేదనుకున్నాడు అప్పన్న. మనిషి ఎవడూ తిరగనైనా లేదు అవును! మొదటాట మొదలెట్టేస్తారు భోజనాలెట్టేస్తారు హోస్టల్లో- యింకేం లాభం. వెంకన్నతో బాటు ఆ యిద్దరూపోయారు యింకేం లాభం ఉంది.

సింహాద్రిని బండికట్టాడు మిగిలిన కాస్త గడ్డిబండిలో వేసి మెల్లంగా ఎక్కాడుబండిలోకి ఆకలేస్తోంది ఒక ప్రక్క గంట స్తంభంలో పావుతక్కువ ఏడు తన కేరుపు వస్తుందేమో అని భయపడ్డాడు అప్పన్న

"ఛా! ఛా!" అంటూ నడవటం యిష్టంలేని సింహాద్రిని నడిపిస్తున్నాడు గేటు దాటుతూంటే ఎవ్వరో ఒకమనిషి పరుగెత్తుకొస్తుండటం చూశాడు కోటు. అవీ.. అన్నీ ఉన్నాయి

"బాబూ బండీగావాలా!"

"సెకిలురిక్షా ఉందాక్కడ?"

"లేదు బాబూ!"

"చచ్చానుఫో!"

"బండీ కడా బాబూ!"

"ఏం లాభమోయి జనతా కెళ్ళాలి ఇంక మహాఉంటె పావుగంటుంది — నువ్వలా తీస్కెళ్ళగలవ్ !"

"జనతా కాండీ?"

గుండె డక్కుడక్కుమంది అప్పన్నకి ఆయనేమో కంగారుపడుతున్నాడు యివ్వాళ సేప్పటికి సింహాద్రి జ్ఞాపకమొచ్చాడు మనసులో దణ్ణం పెట్టుకున్నాడు బండి కాస్త ఆలస్యంగావస్తే బావుణ్ణనుకున్నాడు.

"రండి బాబూ!"

"నువ్వేం తీసుకెళ్తావోయ్ !"

"తీసికెళ్లి బండికందిచ్చే పూచీ నాది బాబూ!"

"ఎంతడుచ్చుకుంటావ్ !"

"మీదయ,రండీ-ఆలస్యమయిపోతోంది!"

"అంగుతుందంటావా !"

"ఆ! ఎక్కండి!"

అప్పన్నదిగి సింహాద్రి దగ్గిరికెళ్లి, చేతులతో దణ్ణం పెట్టి.

"రక్షించు సింహాద్రి - నిన్నే నమ్మాను- బాగా పరుగేస్తావా?" అని ఎక్కాడు

ఒక్క ఛురక వేశాడు సింహాద్రిని - అదే మొదలు పెట్టింది పరుగు; అప్పన్నని బాగా అర్థం చేసుకున్నట్టు; అప్పన్న అవసరం తెలుసుకున్నట్టు; తాను చేయవలసిందంతా చేసేశేట్లు.

రోడ్డు మెల్లగా కొండమీదికిపోయి గాని, కొండదిగదు అన్ని బళ్లు ఆచోట నడుస్తాయి, నడిపిస్తాయి కాని సింహాద్రి మాత్రం పరుగెత్తాడు. అంగ అంగ కొంత దాటని దూరాన్ని లాగేస్తోంది ఆగనన్నట్లుగా పరుగెడుతున్నాడు సింహాద్రి

"ఏడుకి ఐదునిముషాలు తక్కువ, ఏడు ఐదుకి బండి - పరుగెత్తాలి - లేకపోతే అందుకోం!" అన్నాడు లోపలాయన

సింహాద్రికి కొంచెం కోపం వచ్చే ఉంటుంది. కాని అది అధికారిమీద అభిమానమై కూర్చుంది వెంటనే వేగం హెచ్చించింది

అప్పన్నమాత్రం కళ్ళాన్ని పట్టి కూర్చున్నాడు - సింహాద్రికి అప్పన్నమీద దృష్టంతా! ఆ బండీ అందుతే ఆ అయ్య ఎంత సంతోషిస్తాడు - అనే తప్ప వేరే ఆలోచనే పోవటంలేదు

దూరంగా రైలుకూత విన్పించింది - ఒక్కసారి అప్పన్న గుండెల్లో జనతా పరుగెత్తింది

"బాబూ టయమెంతైంది?"

"ఇంకా మూడు నిముషాలుంది!"

అమ్మ బాబోయ్ అన్న అరుపు లోపలే అరుచుకున్నాడు. "సింహాద్రీ" అని అప్పన్న గట్టిగా అరిచాడు. సింహాద్రి వేగం వర్రిగా ఎక్కువైంది

అప్పన్న మనస్సు సింహాద్రికి, సింహాద్రి మనసు అప్పన్నకి, అప్పన్నదీ సింహాద్రి మనసులు రెండూ సింహాద్రప్పన్నకే తెలుసు.

రైలుస్టేషన్ వచ్చింది - జనతా కన్పించలేదు బయటనుంచి - అప్పన్న కంగారు ఎక్కువైంది.

"బాబూ రైలుందా టేషనులో!" అనడిగాడు ప్రక్కనుంచి వెళ్లే పోర్టరుని.

"బిగిలూదాడు పోద్ది!"

"బాబుగోరూ పరుగెయ్యండి!"

వెంటనే ఆ సూటాయన జేబులో చెయ్యిపెట్టి, ఒక కాగితం అప్పన్నకిచ్చి "చాలా థాంక్స్ -బండి అందిందదే చాలు" అంటూ లోపలికి పరుగెత్తాడు, ఎంతో సంతోషంతో.

అప్పన్న దణ్ణంపెట్టాడా బాబుకి - కూడిచ్చినందుకా గోజుకి మెల్లిగా కళ్లు తెరిచేప్పటికి కూతగూసి రైలు బయల్దేరింది. ఆ బండి ఎక్కుంటాడు, టైముంది, సరిగా బండి అందించాడు తాను; తనేమిటి తన సింహాద్రి. తన రాజా! తన తన అన్నీ.

"ఇదుగో నీ దిదిగో అప్పన్నా" అంటూ చేయిపిడికిలి విప్పాడు ఆశ్చర్యం. పది రూపాయలనోటు!

ఎగిరి గంతేశాడు అప్పన్న-"సింహాద్రీ" అని అరిచాడు కావిలించుకున్నాడు సంతోషం పట్టలేక

సింహాద్రి ఆయాసపడుతున్నాడు తన సింహాద్రికి గడ్డికొన్నాడు ఉలవలు కొన్నాడు తనకు బియ్యం కొనుక్కున్నాడు.

ఇంటికొచ్చి భోంచేస పడుకుంటూ

"సింహాద్రి అపన్న"ని "సిహాంద్రి'ని తల్చుకున్నాడు, తనక కూడెట్టనంగుకు

"సింహాద్రి" మాత్రం అప్పన్న పెటన ఉలవలు నవిలి మింగుతూ అప్పన్నను చూసి సంతోషించిం ఎవి పెట్టనంగుకు

అదె సింహాద్రికి, అప్పన్నకి ఉన్న సఖ్యం 

# డబ్బు పిచ్చి

నేనదే సమయానికి యింటికి రాబట్టి కాని, లేకపోతే మా వాకిట్లో ఆనాడో హ రామ రావణ యుద్ధం జరగాలిసిందే! అదేం పొయ్యేకాలమో గాని, ప్రతి విషయంలోనూ మోసమేకదా? ఎంతసేపూ యెదటివాడి కళ్ళల్లో దుమ్ముకొట్టి తను మట్టుకు తను బాగుపడాలనే ప్రతివ్యక్తికీ! ఇల్లాంటి దుర్బుద్ధి బ్రహ్మమొదలు పిపీలికల పర్యంతం వ్యాపించిన తరువాత యిహ ప్రపంచమేమిటి? ధర్మమేమిటి?

నన్ను వాకిట్లో చూడ్డంతోటే నోరు కట్టేసింది, అంతటదాకా యేవో పెద్దపెద్ద కబుర్లు చెబుతూన్న ఆ పళ్ళమ్మి! నా రాకతో ధైర్యం వచ్చింది కాబోలు, వాకిట్లో నిలబడి మామిడిపళ్లు బేరం చేస్తోన్న చిట్టి యింకా కొంచెం పెద్దగొంతుతో —

"చూడు! నిన్నేం చేసామో? అమ్మ! ఇంత మోసమా? ఇంత మోసమా?" అంటోంది గుండెలు బాదుకుంటూ —

"ఏమిటది? ఏమి జరిగింది?" అంటూ గబగబా పెద్దగా అడుగులు వేసుకుంటూ మెట్లెక్కి పైకి వచ్చేశాను.

నా రాకచూచి పళ్లమ్మి చల్లగా జారిపోవడానికి ప్రయత్నం చేస్తోంది

చిట్టి దాన్ని వెళ్లనిస్తేనా?

"ఏయ్! వుండు! వెళ్ళిపోతావేం? ఇప్పుడు చెప్పు నువ్వేం చేశావో?" అంటోంది.

అదంతా చూస్తే నాకేమీ అర్థం కాలేదు

"చిట్టీ! ఏమిటి? ఏమిజరిగింది?" అన్నాను నిర్ఘాంతపోతూ.

"ఏమి జరగాలి? పళ్ళు బేరంచేసి అరడజను రూపాయన్నరకు తీసికొన్నాం! అవే ప్రియమనుకుంటూంటే, రెండురూపా

**గుమ్మళ్ల వెంకటేశ్వరరావు**

యాల కాయితం తీసికొని చిల్లర యివ్వకుండానే యిచ్చేనని దబాయిస్తోంది చూశేరా, యిదేంపాపమో? పచ్చిబూటకంగావుందిగాని మరోలాగులేదు! ముందు దీన్ని పోలీసుల కప్పగించండి! తర్వాత చూద్దాం!" అంది.

చిట్టి చేస్తోన్న హంగామా అంతా చూస్తే నాకేమీ తోచిందికాదు అప్పట్లో!

కాస్సేపటికి తమాయించుకొని "ఇంతకూ చిల్లర యిచ్చేసిందా?" అన్నాను తాపీగా!

"ఇవ్వకేంజేస్తుంది? ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువులు నీళ్ళు తాగించింది; ఆడబ్బులు యివతల పారెయ్యడానికి!"

"పోనీలే! జ్ఞాపకంలేక యిచ్చేశేననుకొంది కాబోలు పాపం! ఇంతమాత్రానికే యింత అల్లరిచెయ్యాలి!" అన్నాను.

"ఇవ్వకుండానే యిచ్చేశేనని యెల్లా అనుకుంటుంది, మీదంతా తమాషా కాని! అయినా ఆ ముండని వెనకేసుకుని వస్తారేమిటి?" అని నన్ను మింగేశేటంత కోపంతో చిట్టి యింట్లోకి వెళ్లిపోయింది

మేమా విధంగా మాట్లాడుకుంటూంటే అదే సందని పళ్ళమ్మి చల్లగా జారుకుంది కాబోలు, నేను వెనక్కి తిరిగి మళ్ళీ చూచేసరికి మాయమయింది.—

నేను లోపలికి అడుగుపెట్టేసరికి; చిట్టికి మూడోపురుడు పొయ్యడానికి వారం రోజుల క్రితం వచ్చిన మా అక్క మొదలుపెట్టింది యేకటాకీని —

"అవునమ్మా! అల్లాగే వున్నాయి రోజులు! అంతా మోసమే!! ప్రపంచమంతా మోసం! డబ్బుకోసం యెన్ని కక్కుర్తిలు పడుతున్నారనుకున్నావూ జనం! మొన్న నేను యిక్కడికి బయలుదేరి వచ్చేప్పుడు రైలుస్టేషనులో యేం జరిగిందనుకున్నావూ? ఒకావిడ పాపం యెవళ్ళో లేరుకాబోలు వెంట నాలాగే! టిక్కట్టు తెచ్చిపెట్టమని ఒక ఆసామీకి నేను చూస్తుండగానే డబ్బుయిచ్చింది. వాడా గుంపులో జొరబడి యెంతసేపటికీ రాలేదు! ఇంతలో రైలు రావడమూ — అంతా యెగబడి, యెవళ్లమట్టుకు వాళ్లం రైలెక్కడం జరిగింది ఇంతకూ, ఆ ఆసామీ టిక్కట్టు తేనేలేదు. ఆ డబ్బు తీసుకొని అదేపోవడం పొయ్యేడు, అంతటితోనే వాడి దరిద్రం తీరేలాగు"

"ఆ! దరిద్రం కాదు తీరేది? వాడి శ్రాద్ధం తీరుతుంది! అదోవిధమైన బ్రతుకు-దొంగబ్రతుకు! అల్లాంటి బ్రతుకు బ్రతక్కపోతే చావరాదు? ముక్కు మూసుకుంటే గడియసేపు పట్టదు!" అంది చిట్టి వళ్లంతా వుడికిపోతూ?—

చిట్టి వైఖరి చూస్తే నా కప్పుడు జాలి, ఆశ్చర్యం కలిగినయి యేమా యింత అమాయకత్వం? అని — క్షణక్షణానికి మారిపోతూన్న ప్రపంచంయొక్క వైఖరి యెండకన్నెరుగక యిల్లే కైలాసమని మురిసే, ఇల్లాళ్ళ కేమి తెలుస్తుంది? తెల్లారిలేస్తే యిల్లాంటి వెన్ని జరిగిపోతున్నాయో మన కళ్ళముందర! అవన్నీ మనం వ్యావహారికంలో, లక్షోపలక్షలుగా చూస్తూండబట్టి మన కవి కొత్తగా అగుపించవు కాని, యెప్పుడో ఒకమాటు నూటికొకటి, కోటికొకటి తారసిల్లే గృహిణుల కవి భయ విస్మయాలు కలిగించడంలో ఆశ్చర్యమేమీ లేదు. రకరకాలైన మానవ ప్రవృత్తులు, ధనార్జనకై ప్రజానీకం పడే పాట్లు చూస్తే తల దిమ్మెత్తిపోతుంది! అవన్నీ ఒకమాటు చిట్టి కళ్లయెదుట ప్రతిబింబింపచేసి, అదే లోకంతీరు-వాతావరణ లక్షణమని, నిరూపించాలి అనుకున్నాను

వెంటనే "అన్నీ సరేగాని చిట్టీ! నీపెళ్లినాడు పసుపుకుంకుమ క్రింద మీవాళ్లిచ్చిన భూమిలోపండిన గింజల తాలూకు లెక్క మొన్న మీ తమ్ముడు యిచ్చినట్లున్నాడు! ఏమిచ్చేడేమిటి?" అన్నాను.

"ఎంతిస్తే యిప్పు డెందుకు?"

"కావాలిలే! చెప్పు!!"

"మొత్తం పన్నెండువందలిచ్చేడు!"

"పంట ధాన్యం నలభయికొటా బస్తాలే కదా! అంత సొమ్మెక్కడినుంచి వచ్చింది?—"

"ఏమో? అమ్మినసొమ్మ యింత, అని చెప్పి యిచ్చిపొయ్యేడు! అంతనీ-యింతనీ, నేను లెక్కలు అడుగలేదు. వాడంతట వాడూ చెప్పలేదు"—

"అదే నేనూ చెబుతూవుంది. బస్తా ముప్పయి రూపాయిల కమ్మితేగాని అంత సొమ్మ రాదుగదా? అసలు రేటు పదిహేడు రూపాయిలే అయినప్పుడు మిగతాదంతా?"

"ఏమో? ఏమిచేశేడో యేమొ? అంతా అల్లా అమ్ముతూంటే, వాడూ అల్లాగే అమ్మేడేమో? ఇంతకూ డబ్బుచేదా?"

"అద్గది! సరీగా దారికొచ్చేవూ! మన కెల్లా డబ్బుచేదు కాదో, అందెటికీ అంతే యెందుకు కాకూడదూ?"

"అదివేలు! మనంవస్తువ యెక్కువధర కమ్మకున్నాము. కాని లోకులసొమ్మ అపహరించలేదే?"

"అపహరించ నక్కరలేదు. అమ్మాల్సిన ధరకుమించి అమ్మితే అదీ మోసమే!"

"అదేమో నాకు తెలియదు!"

"తెలియదులే! స్వవిషయంలో అంతే!"

చిట్టి ఆవిషయమై నాతో వాదోపవాదాలాడడానికి క్షిప్తమున్నట్లు నాకగుపించలేదు ఆవిడ చల్లగా ఆవిషయం మరపించడానికి-

"మా శేరా! మీరింతగా నమ్మి సొమ్మప్పగించిన కొట్టువాడు తనకు లాభసాటగాదని, చీరెలు పంపనేలేదు మీరుచేసిన వుపకారాలన్నీ క్షణంలో మరచిపొయ్యేడు!" అంది.

"ఔను! ఎల్లా పంపుతాడు? మన కసలు ధరలకే యియ్యాలి! బయట అమ్మకుంటే బ్లాకుమార్కెట్టు ధరలు వస్తాయి!"

"అల్లాంటివాడు పంపుతానని యెందుకొప్పుకోవాలీ!"

"అదే లౌక్యం. ఇవతల మొహమాటం! అవతల ధనాశ!"

"ఇమానంలేనా యేమిటి? చేసినమేళ్లన్నీ మరచిపోతారుకాబోలు వెధవఘున్నలు" అంది మాఅక్క మెటికలు విరుస్తూ.

"ఔనక్కా! డబ్బుమీదుంటే మమకారం అల్లే అనిపిస్తుంది. అదిపిన్న పెద్దల తారతమ్యం, పూర్వోత్తర సందర్భాలూ, నీతినియమాలూ, అన్నిటినీ మఱచిపొయ్యేలాగు చేస్తుంది!"

"అయ్యోరామ! ఇంతేనా యేమిటి? మొన్నటిదాకా యీగోల లేదమ్మా! ప్రతి వాళ్ళు గౌరవంతో న్యాయంగానూ, పెద్దమనిషితరహాగాను వుండేవాళ్ళు! ఎక్కడో గాని అన్యాయానికొడిగట్టేవాళ్లుండేవాళ్లు కాదు. నూటికీ కోటికీ యెవడైనా ఒహడన్యాయానికి జొరబడితే, మిగతా వాళ్లంతా వాడిని చితకబొడిచేవాళ్ళు! ఇప్పుడు అదేమీ లేదమ్మా! నూటికి నూరుగురు. అదేపని! ఇదేం పిదపకాలమో? ఏమో?—

"కాలంలో మార్పేమీలేదు. అదంతా వాతావరణాన్నిబట్టి వస్తుంది. ప్రస్తుతం దేశంలో గల కంట్రోల్సు దీనికి కారణం ఈ కంట్రోల్సు కొన్ని వస్తువులకు మాత్రముండి, మిగతా వస్తువులకు లేకపోవడం మూలాన్న, కంట్రోల్సు లేని వస్తువుల ధరలు మితిమీరడమూ - ఆ వస్తువుల సంపాదన కోసరం డబ్బు అత్యవసరం అవడం చేత "డబ్బు పిచ్చి" ప్రతివాళ్లకీ పట్టింది తద్వారా కంట్రోల్సున్న వస్తువుల ధరలు కూడా బ్లాకుమార్కెట్ల నాశ్రయించుకొని రెట్టకి మూడునాలుగు రెట్లు పెరిగి అవినీతికి దారితీస్తున్నాయి దేశం బాగుపడాలంటే అవినీతి చావాలి! అవినీతి చావాలంటే నిత్య జీవనానికి కావాలిసిన వస్తువుల కన్నిటికీ కంట్రోల్సు పెట్టాలి! లేకపోతే యిప్పుడమలులోఉన్న 'అర్ధకంట్రోల్సు' తీసి పారెయ్యాలి! ఇవి రెండూ జరగనన్నాళ్ళూ యింతే!!"

నామాటల కంగీకారం సూచిస్తున్నట్లు మా అక్కనోరు వెళ్లబెట్టి, గుడ్లప్పగించి యెదురుగా యీజీచెయిర్ లో కూచున్న నాకేసి చూడసాగింది.

"అందుకనే గాబోలు మద్రాసు గవర్నమెంటువారు కంట్రోల్సు వకదాని వెంటనె మరొకటిగా తీసివేస్తున్నారు" అంది చిట్టి

"తీసివెయ్యక యేన్నాళ్లుండా లేమిటి? ఇప్పటికే ప్రజలు అతలా కుతలమయ్యేరు, యీ కంట్రోళ్ల నలుగుడు లో బడి" అన్నాను.

"మొదటికేనా యీ మోసం, ధనాశ తగ్గుతుందా మఱి!"

"ఇంతటితో ఏమైంది. ప్రజలకు కావలసిన అన్ని వస్తువులపైనా కంట్రోల్సు పూర్తిగా రద్దుచెయ్యాలి! రద్దుచేసిన తరువాత ఆయా సరకుల ధరలు అంతరిక్షుందాకా లేవకుండా చూడాలి! స్వేచ్ఛావ్యాపారం భారీగా యితరరాష్ట్రాలతోనూ, యితరదేశాలతోనూ, ఖండఖండాంతరాలదాకా పూర్వంలో లాగు జరగనియ్యాలి! ప్రజలలో గొప్ప బీద విచక్షణ నశించాలి! సర్వ సమత్వం కలిగి కడుపునిండా తిండి, వంటి నిండాబట్ట, ప్రతి జీవికీ కలిగినప్పుడింక మోసానికి తావేది? ధనాశ యెందుకుంటుంది? అన్నీ వాటంతటఅవే పటాపంచలైపోతాయి. అప్పుడే దేశం సౌభాగ్యంతో తులతూగుతూ వుంటుంది!" అన్నాను

"నిజమే!" నన్నది చిరునవ్వుతో మా అక్క.

"ఔను కాబోలు!" అంది సన్నగా కూనిరాగంతో చిట్టి!

"అమ్మయ్య! ఇప్పటికి ఆడవాళ్ళని ఒప్పించగలిగేనని పెద్దనిట్టూర్పుతో యీజీచెయిర్ లో జేరగిలబడి పొయ్యేను.— ★

# స్వార్థమా? త్యాగమా?

"ఏదెట్లావున్నా మీరు మాత్రం తప్పక సహాయం చేయాలండీ" అన్నాడు దురుసుగా వెంకట్రావు.

"అవునబ్బాయి, నేను చేయగలిగింది చేస్తాననే చెప్పాను గానీ, చేయనని చెప్ప లేదుకదా"

"మీరు చేయగలగడం, చేయలేకపోవడం అన్నమాట మాదగ్గర కట్టిపెట్టండి ఇల్లా బాధ్యత లేని మాటలు మీలాంటి పెద్దలు మాట్లాడుతూంటంవల్లే మనదేశం యీ హీనస్థితి కొచ్చింది"

"పోనీ, మాబోటి పెద్దలు బాధ్యతలేనట్లు ప్రవర్తిస్తే, మీబోటి పిన్నలు బాధ్యత కలిగి ఏం చేస్తున్నారోయ్? నీ మట్టుకు నువ్వు 'తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం' అని స్వార్థం లేకుండా ఏం చేస్తున్నావు చెప్పు"

ఆ మాటతో ఒక్క వెంకట్రావుకే గాదు, మల్లిఖార్జునానికీ, రంగారావుకూ, రామేశానికీ. అందరికీ బ్రహ్మాండాలు పగిలిపోయేటంత కోపం వచ్చేసింది అందరి మొగాలు కందగడ్డలైపోయాయి ఉండబట్టలేక రంగారావు అన్నాడు

"మేము ఒహో చెంప, విద్యార్థులమై చదువుకోవాల్సిన వాళ్ళమై యుండికూడా అవ్వన్నీ చాలించుకుని, యింటింటికి తిరిగి, మీలాటివాళ్ల చేత అడ్డమైన మాటలూ పడుతున్నా కూడా, యింత ఘనమైన సేవ చేస్తున్నామే! దీంట్లో ఏం స్వార్థం వుందని మీకు తట్ట, మీరిల్లా యింత పెద్దమాట అన్నారండీ? ఈ యాచిస్తోన్న సొమ్మంతా మాకోసమే నన్నట్లుగా మీ రిన్నిమాటలంటున్నారే. ఇంతకంటే యింకేం కావాలి చెప్పండి?"

ఇల్లాంటి కుర్రాళ్ల మనస్తత్వాల్ని అనకున్న అనుభవాల మరలో వేసి ఎన్నడో పిండి చేసినవాడికి మల్లే ఒక్కగాబు నవ్వు నవ్వి వాళ్ళ మొగాలకేసి చురుకుగా చూసి సీతాపతిగారు అన్నారు.

"అవునోయ్, యీ యీడులో నీకేం తెలుసుంది నీలోవున్న స్వార్థం? నన్నడుగు నేం చెబుతాను. మీలాగే నేనూ ఒకప్పుడు విద్యార్థిదశలో వుండేవాణ్నే అనీ, నాకూ కొంత చదువుల విషయం తెలుసనీ, అనుకుంటే—నీవు నాకింతగా చెప్పేవాడివి కానేకావు. చూడు.. మీరు నలుగురూ కలిసి నాల్గురోజులపాటు యింటింటికీ తిరిగి, యిల్లాగా చందాలు వసూలు చేసినంత మాత్రాన మీ చదువులు చెడిపోతాయంటావా? అది కల్లో వారగ పొద్దున లేస్తే సాయంత్రందాకా చీకటి ఆఫీసుల్లో చాకిరీ చేసి నాలుగురాళ్లు తెస్తేనే గానీ పొయ్యిలో పిల్లి లేవకుండా వున్న ఉద్యోగులు తిరగగలరా మీలాగా? కాపరాలు నెత్తిమీద పడక, కష్టం సుఖం అంటే ఏమిటో ఎరక్క, తల్లిదండ్రులు సంపాదిస్తూ వుంటే చదువుతూన్న మీరూ, నిరుద్యోగులై బతికే రాజకీయ నాయకులూ తప్ప యీ పనులకు యింకో ళ్లెలా పూనుకో గల్గుతారూ యీ కాస్తతోనే మీ చదువులు పాడు చేసుకుంటున్నా మంటా వేమిటి?

జ్వాలాశాస్త్రి

"మీకు స్వార్థం లేదంటావ్ మీ మనసుల్లో వున్న అసలు విషయం విప్పి చెప్పేయనా? మీలాగా యింటింటికే తిరిగి యిల్లాగా బెంగాలు కరువుకనీ, రాయలసీమ క్షామానికనీ పేర్లుపెట్టుక తిరిగబోతు అందరూ, కీర్తికోసం, పదిమందిచేత మీరిల్లాంటి ఘనకార్యం సాధించారని చెప్పలు నాయించుకోడానికి కాదంటారా? ముమ్మాటికీ అంగుకేనంటాను."

"మీరు చాలా పొరపాటు పడుతున్నారు ఎన్నటికీ కీర్తికోసం పాకులాడ్డం మాకేతే కాదు అదుగో మీరన్నట్లు, రాజకీయ మురావాళ్లు ఏమైనా దానికోసం తాపత్రయపడితే పడవచ్చు మేము విద్యార్థులం కనకనే, నిస్వార్థ దేశ సేవకు, కటబద్ధులమై యీరీతిగా కృషి సల్పుతున్నాం ఇది యింకా తమకు తెలీకపోతే తెలుసుకోమని మా మనవి" అని అధికారపు హుందాతో అడ్డు తగిలాడు వెంకట్రావు

కాని సీతాపతిగారు వీళ్లకంటే పది ఆకులు ఎక్కువే చదివినట్లున్నారు వదిలేట్లు కనబడలేదు

"నీకసలు దేశసేవ చేయాలని ఎందుకు క్కలిగిం దీబుద్ధి?"

"ఎందుకేమిటి? గోదావరి వరదలు విరుచుకపడ్డంవల్ల యిల్లూ గుడ్డా లేక, తిండీ తిప్పలూ దొరక్క, పిల్లాజెల్లాతో అల్లాడిపోతున్న జనంయొక్క ఆర్తిఘోషలు వినలేక, కడుపు తరుక్కుపోతూంటే, తోటి మానవుల సహాయార్థం యిన్ని తిప్పలూ పడుతున్నాం. మాలో ఇంకా మానవత్వం, దయా అనేవి వుండబట్టే, మేము శక్తిలేని వాళ్ళమైనా శక్తివున్న మీబోటివాళ్ళదగ్గరికొచ్చి తృణమో కణమో సహాయం చేయమని అడుగుతున్నాం. అడగడమేమిట - ప్రాధేయపడుతున్నాం"

"అసలు యీ విషయంలో ప్రార్థించాల్సిన అవసరమే లేదు. ఉన్నవాళ్లు లేనివాళ్లకు యివ్వాల్సిన విధి వున్నప్పుడు దౌర్జన్యం చేసైనా తీసుకెళ్లే హక్కు మాకుంది!" అని వంతపదాలు వ్రాతగా వేశాడు రంగారావు

"మిస్టర్! నీవు చాలా భ్రమపడుతున్నావు. యీ వసూలౌతూన్న డబ్బంతా నిజంగా ఆ బాధితులకే చెందుతుందని నీకు నమ్మకం ఉందా?"

"ఎందుకు ఉండదు—అక్కడ వివిధ సంఘలూ పార్టీలూ కూడలిగా ఏర్పడి ఆహారం వస్త్రం అందరికీ వినియోగమయ్యేట్లు చూస్తారు"

"అదే పొరపాటు రాయలసీమకు పంపించిన చందాల మొత్తాల్లో నిజంగా బాధపడ్తున్నవారికి చేరిన డబ్బెంతో అక్కడ పెత్తనం వహించినవారికీ వారి స్నేహితులకీ అక్కడ చేరిన ఉపగ్రహాలకూ జేబుల్లోకి చేరిన మొత్తం ఎంతో నీకేమైనా తెలుసా?"

"అల్లాంటి వన్నెడూ అంత ఆపద సమయాల్లో జరగవండి, జరిగితే ఒటప్పుడు జరిగచ్చు గాని, అయినా జరిగినట్లు ఏ పత్రిక వార్తల్ని పట్ట రుజూ చేస్తారు?"

"ఏ పేపర్లెందుకూ? ఇవ్వాళ వెళ్ళి రాయిలసీమలో కనుక్కోండి ఎవడైనా చెప్తాడు. పత్రిక లెప్పుడూ యిట్ట వాస్తవిక విషయాల్ని ప్రకటించవు అంత మాత్రాన జరగలేదనుకోవడం, అంతా పరమ సత్య స్వరూపం అనుకోడం, మీ అనుభవాన్ని మాత్రం చెపుతోంది"

"మాష్టరుగారూ, అయితే యిక్కడ కూడా ఎవరో పదిమంది బడుద్ధాయిలు



"నీ కసలు దేశసేవ చేయాలని ఎందు కలిగిందీ బుద్ధి ?"

అంగాగా అలగాపన్లు చేస్తారని మీరు వేనవు వేల జనుల హాహాకారాల్ని చెవినన్నా దూర్చబోరన్న మాట!"

"అట్లని నేననడం లేదు. ఎక్కడ కృషి చేద్దామని వుందో అక్కడ పేరుకోసం తహతహపడడం వుంది. బూటకం వుంది. దొంగతనం వుంది. మీ పార్టీ కూడా పది మందితోపాటు సాయం చేసిందని కేటలాగు ఎక్కడానికే యీ తతంగం అంతా కాని, అక్కడి జనులకు నిజంగా రవాణా జరుగుతూన్న డబ్బు, ధాన్యం వాళ్ల కందుతోందా లేదా అనేమాట మీ కనవసరం అంటాను—ఔనా?"

"ఎప్పుడూ కాదండోయ్." అని అందరూ ఏకగ్రీవంగా అనేశారు.

"కాక ఏమిటిదంతా! పొద్దు నొక సంఘం వచ్చి చందా యియ్యమంటుంది. మధ్యాన్నం యింకో సమాజం మళ్లీ యిదే పాట పాడుతూంది. ఎంతమందికని యిస్తా ముగూర్ర - ఎంత కోటీశ్వరులైనాను."

"అన్ని సంఘాలూ వేరు - మా సంఘం వేరు. మా సంఘంలో సభ్యులంతా, తమ తమ ప్రాణాలు ధారబోద్దామని, త్యాగ బుద్ధితో పని చేస్తున్నారు. మా క్కావాల్సింది - మీరు ద్వేషపడ్డట్టు పేరూ కాదు, పేపత్తట్టా కాదు. మాకు ఆ గోదావరీ ప్రాంతవాసులు సుఖపడి తృప్తిపడటం కావాలి. అదే మాకూ తృప్తి."

సీతాపతిగారు కాస్సేపు అదోలా చూశాడు ఆకాశంకేసి. అంత సేపటినుంచీ, రవంధాళి చేస్తున్న విద్యార్థుల్లోని రక్తనాళాలు కొంత శాంతించి, ఆయన తుది నిర్ణయాన్ని పట్టి తమ అచంచల త్యాగదీక్షను రుజువు చేసికొని కాని అక్కడినించి కదల కూడదని అనుకుంటున్నారు.

ధతాలున సీతాపతిగారు నిల్చునివున్న వెంకట్రావును ఒక్కగా నొక్క సూటి ప్రశ్న వేశారు.

"ఏమోయ్ నీ పేరేమిటో......"

"వెంకట్రావ్."

"ఆఁ వెంకట్రావూ! యింటి పేరేమని చెప్పావ్?"

చెప్పాడు

"... వా రబ్బాయివా" అని

# ★ స్వార్థమా? త్యాగమా? ★

కోరిక మళ్ళీ నిదానించి అతడికేసి చూశాడు. అడిగాడు.

"వెంకట్రావూ, నీవు గోదావరీ ప్రాంత వాసులకు, సౌఖ్యం, తృప్తి కలగానని యింత త్యాగం చేస్తున్నానన్నావు కదా అసౌఖ్యం, తృప్తీ అర్థంలో అంటే నీ నాలుగురోజులపాటు గవర్నమెంటువారి చేత జనానికి గంజినీళ్లుపోయించి సత్రాల్లో నివాసం ఏర్పరచడమేనా, లేకపోతే..."

"మాకు చేతనయింది అంతేకదండీ అంత కంటే మాకు సాధ్యమైన ఏ సహాయమైనా చేయగలం. అక్కడ నిరాధారులైన ఎంత మందో జీవాలకూ ప్రాణాలకూ శాశ్వతంగా తృప్తినిచ్చే ఏవిషయంలోనైనా ఉద్యోగాలిప్పించడంలోనైతేనేం, తీవ్ర ఆందోళన లేవదీయబోతున్నామండీ!"

"నీపద్ధతి మాస్తే, అక్కడేదో జీవాలూ, ప్రాణాలూ నీ సమీపంలో వున్నవాళ్లకి భిన్నంగా, శరత్ బాబు నవలల్లోకి మల్లే వున్నాయనుకుంటున్నావు కాబోలు. మన లాగే వున్నాయి అవ్వి మన యిరుగు పొరుగువారి కష్టాల్ని, దోసగుల్ని సరిచేయ లేనివాళ్లం "మనకెందుకులే" అని పట్టించు కోకుండా తిరిగేవాళ్లం—'దూరపు కొండలు నునుపు' అని అక్కడేదో ఉద్ధరించుదామనుకొంటాలేమిటి?

భర్త: "ఏమే, మన అబ్బాయి నన్నింకా 'నాన్నా' అని పిలవడంలేదేం? ఆముక్కకాస్త గట్టిగా నేర్పకూడదూ?

భార్య: "వద్దులెండి. ఇప్పణ్ణించే మీా రెవరో చెబితే వాడు భయపడిపోతాడు."

"ఆ గోదావరివాళ్లే నీదగ్గరికొచ్చి, మీాచేతయిన ఉపకారం చేయండని బాగుపడతామనీ అంటే, నీబోటివాళ్లే - "సరే మిరా మావల్ల కాదంటార"ని ముమ్మాటికీ రాశి యివ్వగల్ను.

"పైగా వాళ్లందరికీ తృప్తి నిస్తామంటావ్. వివిధవర్గాలు గల ఒక పెద్ద జనసమూహంలో వాళ్ళకి వివిధరకాలుగా వుంటుంది తృప్తి నిచ్చేపద్ధతి. ఒకడికి గంజినీళ్ళుపోస్తే ఆరోజుకు వాడికి తృప్తే. "దేహీ!" అని యాచించక గుట్టుగా బ్రతికే ఒక సంసారికీ, ఆరోజా అవసరంకొద్దీ గంజి త్రాగడం తృప్తికాదు. తనకు మళ్ళీ తన స్వస్థత చేకూరడం తృప్తి. ఒక డబ్బులేని లాయరు గారికి యీ వెలువలో పాడైపోయిన పుస్తకాలు ఎవరన్నా యిస్తే అప్పుడు తృప్తి. నీకేంతెల్సు తృప్తి అంటే దాచి పెట్టుకున్న నోట్లు కాస్తా తడిసిపోయి "లబో దిబో"అనుకున్నవాడికి నీ త్యాగం ఏమాత్రం తృప్తి నిస్తుందయ్యా! ఎన్ని కుటుంబాలు యీ విపత్తువల్ల శుభకార్యాలకి అభ్యంతరములొచ్చి యీాతిబాధలు పడబోతున్నారో వాళ్లకి తృప్తి, సౌఖ్యం మీాతర మేమవుతుందీ యివ్వడం? ఏం త్యాగమయ్యా మీారు చేశేది?" అని పూరుకున్నారు సీతాపతి గారు.

ఈ ఉపోద్ఘాతంతో వెంకట్రావుకు శివమెక్కినంత పనైంది. సీతాపతిగారి కర్ణ కఠోరపు సవాళ్ళూ, సముదాయింపులూ, అంత తేలికగా తోసివేయటాలూ, భరించడం యిహ దుర్భరం. యిట్లాంటి వ్యక్తికే సమాధానం చెప్పి ఒప్పించలేక వెనుకకు తిరిగే వెళ్ళితే, అది తమ మహత్కార్యంలో పెద్ద అపజయంగా భావించాలిసిందే. అందుకే ఉండబట్టలేక వెంకట్రావన్నాడు.

"మీారిక్కడ కూర్చుని తృప్తినిగూర్చి యింత జిజ్ఞాస చేస్తున్నారు కాని అది ఏనాడో మాకు తెల్సు. మేము త్రికరణ శుద్ధిగా అన్నిరకాల వ్యక్తులకీ అన్నిరకాల

సౌఖ్యాలూ అవకాశాలూ కల్పిద్దామనే ఏకైక దీక్షతోనే యీ ప్రయత్నం చేస్తున్నాం. వీటికై మా సర్వసౌఖ్యాలూ త్యాగం చేయడానికి నిర్ణయం చేశాం తెలుసా అండీ?"

"అట్లైతే.. " నింపాదిగా అందుకున్నారు సీతాపతిగారు, "నేను గోదావరి ప్రాంతవాసిని నేనూ ఆ వరదలవల దెబ్బతిని యీ వూరు తలదాచుకోడానికని వచ్చాను మీరు నాకేం సహాయం చేస్తారు?"

అంతా ఫక్కున ఒక్కసారి నవ్వారు రామేశం అన్నాడు "ఇట్లా అయితే ఇహ ప్రతివాళ్లూ తినికూర్చుని వరదలవల్ల అవస్థపడుతున్నామనే చెప్తారు చందాలివ్వకుండా తప్పించుకునేందుకు భలే యెత్తు ఎత్తారండీ!"

"అది కాదు నాయనా!" యీమాటు సీతాపతి అతిదీనంగా ప్రారంభించారు. ముఖం మారిపోయింది—"యీయిల్లు నాది కాదు. నేను యీ వూరు వచ్చి ఐదు రోజులైంది. మావూరు అమలాపురం దగ్గర. నాకు రెండెకరాల పొలం వుంది

"నాకు కరణీకం అదీ వుండేది చిల్లర పనులవీ యివీ చేసుకుని బ్రతకాల్సినవాణ్ణే కాని నాకేమీ యిప్పుడు వేరే అధరువులేదు కావడానికి మా సంసారం పేరు ప్రతిష్ఠలు గల్గిన హోదా వ్యవహారంలోదే. ఇప్పుడు నాచేతిలో కొచ్చేటప్పటికి అదంతా చితికిపోయింది నేనూ డొక్కశుద్ధిగా చదువుకుని కాంగ్రెసుతో పాటు జైళ్ళకెళ్ళినవాణ్ణే కానీ స్వతంత్రం వచ్చింతర్వాత మావంటి వాళ్లకు పనేం లేకపోయింది అందుతోనే పట్టుకొచ్చిన సత్యం, శౌచం కోసం నిలబడే టప్పటికి, పై అధికార్లతో, తకర్లొచ్చి, నా కరణీకానికి స్వస్తచెప్పారు

"ఇప్పుడల్లా నేను, నా కూతురూ వున్నాము. ఆ అమ్మాయికి జబ్బుచేసి ఊరులో అయుర్వేద ఘనవైద్యుడెవరో వున్నాడంటే విని, ఒక ఆసామీదగ్గర రెండువందల రూపాయిలు అప్పుచేసి బైలుదేరి ఆఊరెళ్లొచ్చాను అక్కడ పనిముగించుకుని తీరళ్ళా రైలెక్కి యింటిదారి పట్టేసరికి, మధ్యలోనే మా రైళ్లు ఆపేశారు ఏమిటా విశేషం అంటే అకస్మాత్తుగా యిల్లా గోదావరి వరదలు వూళ్ళన్నీ ముంచేశాయని వారలు తెలిశాయి నేనింకా, రైలు కదలివెళ్ళినా, యింటికెళ్ళి జలప్రవాహం చూడడమే కదా అని విరక్తిపుట్టి యిక్కడే దిగాను. నేనువెళ్ళినా నా వూరిల్లూ, ఆ యింట్లో పదిలం చేసుకున్న గాదెల్లో ధాన్యం, నా పిల్ల పెళ్లికోసం దాచిపెట్టిన రెండువేల రూపాయిలనోట్లూ అన్నీ సర్వనాశమైనాయని నేను వేరే వూహించాల్సిన అవసరం లేకుండానే తెలిసిపోయింది ఇంకా ఆ వూరివాళ్లలాగా ప్రాణాలకుకూడా భయపడాల్సిన అనుభవం మాత్రం తప్పింది నిజానికి ఆ నీళ్ళల్లో కొట్టుకపోయేవుంటే యీ జీవనభారం మోయనక్కరలేకుండా తప్పేదికదా అనిపిస్తూంది ఇప్పుడు

"నేను నా జీవితంలో యాచించడం అంటే ఏమిటో ఎరగనివాణ్ణి యీ స్టేషన్లో దిగి ఒక రాత్రిపూట ఒకళ్ళ పంచలో తలదాచుకుందామని చూస్తే, దొంగలమాదిరిగా సంజాయిషీ సమాధానాలు చెప్పుకున్నాను రెండోరోజున ఎల్లాగో యీ రెండుగదులున్న యిలూ ప్రస్తుతానికి రు 5 లు యిచ్చి అద్దెకు తీసుకచేరాను యీ నాల్గు రోజుల్నుంచీ నాల్గు ప్రాణాహుతులు వేసుకుంటున్నాను ఇంకా నాదగ్గర పాతిక రూపాయలుమాత్రం వున్నయ్ అరవయ్యోపడిలో పడి, దగ్గుతో బాధపడేవాణ్ణి నాకివ్వాళ, బంట్రోతు ఉద్యోగంకూడా, దొరకదని నాకు తెలుసు. యీయవారం చేసుకునే శక్తి వుందునో వుండదో .

"పోతే నాకు యీ పెళ్లీడు మించిపోయినపిల్ల వుంది" అని వెనక్కు తిరిగి 'పూర్ణా!' అని కేకవేశారు. లోపల్నించి పూర్ణ వచ్చి అందరూ వుండటంవల్ల తండ్రిదగ్గరికి రావడానికి జంకినట్లు నిలబడి, 'ఏమిట'ని అడిగి మళ్లీ వెళిపోయింది సీతాపతిగారు, కళ్లనీళ్లపర్యంతంగా యీ ఉదంతాన్నంతా చెప్తూంటే నిస్తబ్ధులై వింటున్నారు. ఆయన అల్లాగే చెప్పుకపోతున్నారు.

"ఈపిల్లకు పెళ్లికావాలి యీరోజుల్లో కట్నం లేకుండా మీలో ఎవరు చేసుకోగలరో చెప్పండి నా పరిస్థితులకి తోడు కరువులో అధికమాసం వచ్చి కూర్చుని నాకున్న యిల్లూ వాకిలీ నాశమైపోయాయి. దాచిపెటిన నోట్లుకూడా గంగమ్మ తీసుకెళ్లింది ఇక యీ పిల్లగతేంకాను? యీ పిల్లకు చదువు చెప్పించే తాహతా నాకు లేకపోయింది

# ★ స్వార్థమా ? త్యాగమా ? ★

"ఈడొచ్చినపిల్లను యింట్లో వుంచుకున్న తండ్రిగతి బహుశా మీకూ చెల్లెళ్ళు వుండి యిట్టి కష్టాలు వస్తేనేకాని తెలీనే తెలీదనుకుంటా డబ్బు వున్నవాళ్లు మీరు మీతండ్రులు మొగపిల్లల్ని అమ్మకునేటప్పుడు వచ్చే వేలరూపాయిలకట్నాలూ ఆడపిల్లలకోసం అల్లుళ్ళను కొనుక్కోడానికి పనికొస్తాయి. కానీ నా సంగతేమిటట?

"నేను గోదావరివాసిని. నా అవస్థలాంటి అవస్థలు మీ సంఘాలు చందాలు వసూళ్లు చేసి తీరుస్తాయా? ఆందోళనలు లేవదీసి తీరుస్తాయా? దేశమంతా యీ దారిద్ర్యం ఉన్నప్పుడు మేమేం చేస్తామని అంటారు! ఆసంగతీ నాకు తెలుసు! కానీ తనదాకా వచ్చేంతవరకూ కష్టాలంటే వాటి లోతు ఎంత అనంతమో తెలీదు అబ్బాయ్! దీనికి మీరేం త్యాగం చేస్తారు?

"గోదావరిజిల్లాలో నాకంటె ఘనమైన కుటుంబాలు ఎన్నో యిట్లాంటి యిక్కట్లలో వున్నాయని నేను ఊహించడానికి ఎంతో సేపు పట్టదు. వాళ్ళు మీరూ, మీ ప్రభుత్వాలూ పెటే తిండితో సంతృప్తి పడరు. వాళ్ల బాధలు పైకి కనపడని తీరని సమస్యలు—వీటికి మీరేం చేయగల్రు? మీ సంఘాలేం చేయగలవ్? మానం వున్న ఏ వ్యక్తీ మీ డబ్బుకోసం సంతోషించదు" అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు సీతాపతి గారు.

"నేనూ మీమల్లే పెద్ద డిగ్రీల చదువులు చదవకపోయినా, సాంప్రదాయంవల్ల పరిసరాలవల్లా కొంత అనుభవం సంపాదించగల్గాను నిజంగా బాధలుపడి కుమిలిపోయే వాళ్లు పైకి పొంగలేరు ఏమీ లేనివాడే పెద్ద ఆర్భాటం చేస్తాడు. అంతే యిప్పుడు మీరు చేస్తూంది కూడా."

ఈ మాటల్తో అక్కడి యువకులంతా కదిలిపోయి కడుపులో మాత్రం "పాపం!" అని సానుభూతి చెప్పుకున్నారు. నీరసంగా వెంకట్రావు మాత్రం తను ప్రస్తుత అశక్తతని తెల్పాడు "మీరు చెప్పిన బాధలు అందరికీ వున్నాయని మేము అంతమాత్రం ఆలోచించకపోలేదండీ - కాకపోతే యీ విషయాల్లో అశక్తులమని చెప్పుకోవాలిగానీ!" అని.

"అట్లా అనకు వెంకట్రావ్, మీరు అశక్తులు గారు. సంఘం మారాలంటూ సమాజం వేరే వున్నదంటూ సాకులు చెప్పేమాటలు నేను నమ్మను. నెత్తురూ కండలతో వున్న ఎదురుబడ్డ వ్యక్తులు-మీరూ నేనూ మారితే, మనలో మనకి అన్యోన్య సహకారాలు వుంటే సంఘం మారినట్లే అనుకో! ఎదుటివాళ్ళకి సహాయం లేనివాళ్ళు, ఏదో ఎవరికో చేస్తున్నాం అనుకోడం - అది కీర్తి ప్రతిష్టలు రావాలని ఆరాటపడ్డమే అవుతుంది"

"అదుగో మళ్ళీ అదే అంటారు? కీర్తి ప్రతిష్ఠ లెందుకండీ మాకూ యిట్లా మీబోటివారికే చేతనయిన సహాయం చేయదలచామంటే నమ్మరేం?"

"చేద్దామనుకోవాలే కాని, యిది మీ చేతిలోనిపనే! కాని మీరు ససేమిరా ఒప్పుకోరు. మీవాళ్లమీద తోసేసి ఏదో ఒక

పనిమనిషి తనకు పెళ్లి కాబోతోందనీ, నాలుగు రోజులు సెలవిప్పించమనీ యజమానురాలిని అడిగింది. సెలవు తీసుకుని వెళ్లబోతూ, "కాస్త ఈ 20 రూపాయలూ మీదగ్గిర దాచిపెట్టండమ్మా" అన్నది.

"ఏం, నీ మొగుడుదగ్గిరే దాచుకోరాదా?" అని యజమానురాలన్నది

"మీ దగ్గిరే వుంచండి కొత్తమనిషిని నమ్మి డబ్బియ్యడం మంచిది కాదు."

కారణం చూపించి తెలివిగా ఆవాల్టికి తప్పుకుంటం మాత్రం మీ చేతనవును - అంతే"

"లోకులంతా అల్లా తయారైయారని చెప్పడం బాగా నేవుంది కాని మా విషయం మీ రింకా అర్థం చేసుకోకపోడమే విచారంగా వుంది. మేము అన్నీ త్యాగం చేయగలమండీ!"

"ఐతే, మీకు కోపం రాకుండావుంటే ఒక్క ప్రశ్న వేస్తాను సమాధానం చెప్పుతారూ?"

ఏమిటన్నట్లు అందరూ అయన్ని చూశారు

"నాకేపిలవుంది వెంకట్రావుకు యీడూ జోడూ సరిపోతుంది మాకూ వాళ్లకూ సంబంధాలున్నాయి అతన్ని నాపిల్లను చేసుకుని, యీ రూపేణ నాకు సాయం చేయమనండి! నాకేబాధ్యత పూర్తి అయితే నాదోవన నేను కాశీయాత్ర చేసుకుంటాను"

అందరికీ ఒ పెద్ద పిడుగు పడ్డట్టయింది. తమాయించుకుని రామేశం అన్నాడు.

"అది కాదండీ మేము చందాలు రావడమేమిటి మీరిలాగా మీపిల్లను చేసుకోమనడమేమిటి? యీ వ్యక్తిగత విషయాల్లో ఒకమర్యాదా, తాహతు వుండక్కర్లేదండీ?"

"అయ్యా, ఇప్పుడే తేలిపోయారుమీరు. అందుకే మిమ్మల్ని అడిగాను మీ త్యాగం అంటే యింతే! వ్యక్తిగతమైన విషయాలనీ తాహతులనీ అంటారని నేనిందాక చెప్పాను నాకు చేతిలో కట్నం లేకుండా మీయింటి గడపదొక్కే తాహతు లేదు అందుకే యిక్కడ అడిగాను నా పరిస్థితులు మీరు నమ్మివున్నట్లయితే నామీద మీకు తప్పక

దయుకలిగేదే! మీ ఆదర్శాలకు సహాయం చేసేందుకు, మీరూ నేనూ తోడ్పడు కోవాలి. అట్టిది, మీ రిక్కడ అశక్తత చూపిస్తారు; మావాళ్లనడ గాలంటారు? ఏం?"

"మీ ఒక్క పిల్లను వెంకట్రావు చేసు కుంటే సరిపోతుందిటండీ; పోనీ అట్లాగే అనుకున్నా మీకు మల్లే ఎంతమంది లేరు? వాళ్ళగతి ఏంకాను?"

"నేనా మాట కాదనను. కాని మీ ఎదు రుగుండా వున్న చిన్న సమస్య ఇది. ఇది ఉభయత్రా మంచిని చేసేదేను వెంకట్రావు అంతకంటె వేరే ఏమీ చేయలేడు. అందుకే దీంట్లో తన త్యాగశక్తిని చూపమంటు న్నాను. ఈ ఆందోళన లేవదీసి యిల్లా అందరికీ సహాయపడ్తామంటే నేను తప్పక ప్రోత్సహిస్తాను. కానీ మీరు ఆచరణలో మీ ఆదర్శాలను పెట్టగలరో లేరో తెలి సేందుకు యీ సహాయము చెయ్యాలి!"

"మాకు మీరు చందా యివ్వలేని పరిస్థి తుల్లో వున్నారన్నారు కనక, దానికోసం మీకూడా కొంత ధనరూప సహాయం చేయించగల్గుతామే కాని, యిదేమిటండీ పిల్లను పెళ్ళిచేసుకుంటే కష్టాలు గట్టెక్కు తాయా?" మల్లిఖార్జునం అందుకున్నాడు.

"మీకు కావాలంటే, మీరు వృద్ధా ప్యంలో వున్నారు కనక వరుణ్ణి కూడా తగినవాణ్ణి కుదుర్చుతాం. అంతే కానీ మమ్మల్ని దుయ్యబట్టుకుంటే, మాముందు బోలెడంత కార్యక్రమం వుంటే, అదంతా చాలించుకుని మీరు అడిగినట్లు ఎల్లా చేస్తా మండీ!" అన్నాడు రంగారావు.

వెంకట్రావు మాత్రం మాట్లాడకుండా ఏదో సందిగ్ధావస్థలో వున్నట్లుగా ఒక కంట చూస్తున్న సీతాపతిగారు అన్నారు.

"నాకు మీ ఆర్థికసహాయమూ వద్దు. నా కెక్కడా కనబడని వరుణ్ణి దొరకలేదని చెప్పి నచ్చ జెప్పనూ ప్రయత్నించవద్దు. మాకూ వారికీ సంబంధా లున్నా యియ్యా. మీ రిక్కడ 'సరే' నని వాగ్దానం చేస్తే, మీ పెద్దలదగ్గరికొచ్చి అన్నీ విన్న వించుకుంటాను. మీ వంశం మా వంశం బాగుందనుకుని, మా పిల్లను మీవాళ్ళంతా యిష్టబడితేనే వివాహం చేయండి. అందరి కంటె పిల్లవాడికి పిల్లనచ్చడం ముఖ్యంగదా. కనక అతనికి నాకు సహాయంచేసి, తన కొచ్చే యింతకంటె మంచి సంబంధాలను కట్నాలను త్యాగంచేసే శక్తివుంటే, తప్పక యిష్టపడతాడు. వాళ్ల పెద్దల్నికూడా బల వంతంచేస్తాడు. అందువల్ల - నాకు మీరె సాకులూ చెప్పాల్సిన పనిలేదు.

ఊరికే ఉబుసుపోక, త్యాగమనీ, స్వార్థ రహితం అనీ కబుర్లు దంచడంకాదు. నాకీ సహాయంచేస్తే మీ కెంతకీర్తి వస్తుందో, నాలాంటి ఒక వృద్ధప్రాణి ఎల్లా తృప్తి పడుతుందో గ్రహించుకోగలిగితే యింకా మీరు వాదన చేయరు"

ఇదిఒక అగ్నిపరీక్షగా తయారైంది ఆ యువకులకందరికీ వెంకట్రావుకు మరీ

(58-వ పేజీ చూడుడు)

# విజ్ఞాన వీధులు

"డాక్టర్"





## 154. ఎలెక్ట్రిక్కు తీగలు

ఎలక్ట్రిక్కు తీగలను గురించిన సందేహాల నెన్నిటినో దెందులూరునుంచి వడ్లపట్ల వెంకటరత్నముగారు అడిగినారు. మా జవాబులోనే ఆ ప్రశ్నల నిమిడ్చి వ్రాయుచున్నాము

బేటరీలైటులో నిమిడ్చే బేటరీని విరిచి పరిశీలించండి రెండు ధ్రువాలు కనబడతాయి ఆ బేటరీ మధ్యన ఇమిడ్చే కర్బనపుకడ్డీ యొక్క పైకొన ఒక ధ్రువమూ (దీనిని ధన ధ్రువమన్నారు) ఆ బేటరీయొక్క తుత్తునాగపు తొడుగుకి తగిలించిన ఇత్తడి స్ప్రింగువంటిది రెండో ధ్రువమూను. (ఇది ఋణధ్రువము) ఈరెంటినీ బల్బులోని తీగ ద్వారా కలిపితే బల్బుతీగెలో విద్యుత్తు ప్రవహించి వెలుగుతుంది. బేటరీయొక్క బొత్తాము కిందకి జరిపితే జరిగేదిదే.

విద్యుద్ఘటానికి ధనధ్రువమూ, ఋణ ధ్రువమూ రెండు ధ్రువాలుంటాయని తేలినది ఈరెండు ధ్రువాలనూ లోహపుతీగెద్వారా కలిపితే ఆ తీగెలో విద్యుత్తు ప్రవహించి బల్బు వెలగడమో, ఫాను తిరగడమో జరుగుతుంది. ఒక బేటరీ శక్తికి సుమారు రెండు వందలరెట్లు శక్తిగలిగిన విద్యుత్పీడనాన్ని పవర్ హౌసులో తయారుచేసి, ధన, ఋణ ధ్రువాలకి కలిపిన తీగలను స్తంభాలమీద లాగుకుని వస్తారు. ఈ తీగలను ఇంకొక తీగ ద్వారా కలిపితే ఆ తీగలో విద్యుత్తు ప్రవహిస్తుంది ధన ధ్రువపుతీగని ఎత్తుగా ఉన్న నీటితొట్టెతోనూ, ఋణధ్రువపు తీగని తక్కువ మట్టములో ఉన్న నీటితొట్టెతోనూ, ఈ రెంటినీ కలిపే తీగని, ఆ తొట్టెలను కలిపే గొట్టాముతోనూ పోల్చవచ్చును. స్విచ్చి ఈ గొట్టాములోని బిరడా. స్విచ్చి వేయడమంటే ఈ బిరడాని తెరవడమన్నమాట

మూడు తీగలు కనపడతాయే, మూడెందుకూ? అని అడిగేరు. ఇళ్ళలోని అవసరాలకి 220 వోల్టుల పీడనము చాలు కనక కేవలము ఇళ్ల అవసరాల కయితే, 220 వోల్టుల భేదముగల రెండు తీగెలు లాగితే చాలు. కాని ఫ్యాక్టరీలకి 440 వోల్టుల పీడనము కావాలి అందుకని, 1, 2, 3 తీగలు ఏర్పరుస్తారు. 1వ తీగకీ, 2వ తీగకీ 220 వోల్టుల భేదమున్నూ, ఈ రెండోతీగకీ, మూడోదానికీ 220 వోల్టుల భేదమున్నూ ఏర్పాటుచేసి, ఊరంతటా ఈ మూడుతీగలూలాగి ఏర్పాటు చేస్తారు. గృహావసరాలకి 1, 2 గాని, 2, 3 గాని అందితే 220 వోల్టుల పీడనము అందుతుంది. ఫ్యాక్టరీలూ, ముద్రాక్షరశాలలూ మొదలైన పారిశ్రామిక సంస్థలకి 1, 3 తీగెలు అందిస్తే 220 + 220 మొత్తము 440 వోల్టుల పీడనము అందుతుంది. ఎవరు ఏమూల పారిశ్రామిక సంస్థను నిర్మిస్తారో తెలియదు కనక ఊరంతటా ఈ మూడు తీగలూ లాగుతారు ఇందులో ఒకటి ఫేలయితే మొత్తపు కరెంటు ఫేలవదు. ఒకటి తెగిందనుకోండి 2, 3 పనిచేస్తాయి వాటి నడుమ 220 వోల్టుల పీడనముంటుంది గదా?

ఒక కోతి ఒక తీగను మాత్రమే పట్టుకుంటే దానిలో విద్యుత్తు ప్రవహించదు కనక అపాయము లేదు. ఒక చేతితో ఒక తీగ, రెండోచేత మరోతీగా తాకితే మాత్రము అపాయము తప్పదు. పైన వివరించిన దానినిబట్టి ఏ రెంటిని తాకినా ప్రమాదమే. తిరుపతి కోతులిలాగే తగ్గిపోయాయి

1, 2 గాని, 1, 3 గాని స్విచ్చివేసినపుడు మన ఇళ్లలోని బల్బులద్వారానూ, పెద్ద మోటార్లద్వారానూ కలుస్తాయి కనక వాటిద్వారా ప్రవహించే విద్యుత్ప్రవాహము మోతాదుగా వుంటుంది. గాలికి రెండుతీగలు తగిలితే, వాటనడుమ బల్బులూ మిషనులూ లేవుగా? విద్యుత్తు అతిగా ప్రవహించి, అవి విడినప్పుడు ప్రవహిస్తూనే ఉండాలన్న యత్నంలో మంటగా మండుతుంది మోటారు బేటరీ ధ్రువాన్ని తీగెతో కలిపి, ఆ తీగ రెండో కొసని రెండో ధ్రువము మీద రాస్తే చిణుకు పుట్టినట్లే ఈ మంటకూడానూ.

టెలిగ్రాము తీగెలున్నచోట కరెంటు తీగెలు ఏ ప్రమాదమువల్ల తెగినా ఆ టెలిగ్రాము తీగలకు తగిలి వాటి కొసనున్న యంత్రాలకి అపాయము కలిగించకుండా వలలాంటి తీగలు అల్లుతారు ★



## చిట్టిప్రశ్నల - జవాబులు

—'నాడి' అనే గ్రంథము ప్రతీదీ జాతకాల సమూహము ఓపికగల ప్రాచీన జ్యోతిష్కు డెవరో మొత్తమ్మీద ఉండ

గల జాతకాల రకాలను రాశేసుకుని పెట్టుకున్నాడు. ఎవరు వెళ్ళి అడిగినా, వారి జన్మదినమూ, జన్మకాలమూ అడిగి, వారి జన్మము వారు చెప్పిన కాలమునకు కొంచెము ఇటూ అటూ అయినా సరే గుణించగల జాతకాలు తీసి, మళ్ళీ వారు వచ్చినప్పుడు స్థాలీపులాకంగా వాటిలోని ఘటనలను చదివి ఏ జాతకం వారి జీవితానికి సరిపోతే, ఆ జాతకపు పూర్తి వివరాలు ఇస్తాడు. నాడీ గ్రంథాలు చాలా వున్నాయి. అంటే ఎవరో ఒకరు గుణించిన బృహద్గ్రంథము ముక్కలుగా విడిపోయేనా వుండాలి, లేక వారికి తోడు ఇతరులు కూడా అలాంటివి వీలైనంతగా గుణించేనా వుండాలి 'సర్వ ఋషినాడి' అన్నదానికి అందరు ఋషులూ కలిసి గుణించిన నాడి' అర్థము చెప్పుకోవలసి వస్తుంది.

—కాదు. వైష్ణవ మత విజృంభణతో తెలుగునాటి శివాలయాలు కొన్ని వైష్ణవాలయాలుగా మారినవన్న మాటలు పుకారులు కావు. శ్రీకూర్మములో స్వామి లింగాకారముగానే ఉన్నాడూ, దేవాలయ గర్భగృహానికి నడుమ నున్నాడు! ఇంకా వినండి స్వామి కూర్మరూపుడని ప్రసిద్ధి తల ముందువైపు లేదు! వెనకవైపుకి గాబోలు ఉన్నది. స్వామి శివుడుగానున్నప్పటి అమ్మవారు నేటికీ ఆ దేవాలయపు గూళ్లలో ఒకదానిలో ఉన్నది. ఇంతపాటి సాక్ష్యము చాలనుకుంటాను. సింహాచలములోనూ స్వామి గర్భగృహామధ్యమున లింగము ఉండేటట్లే ఉన్నాడు. జైనుల ఆలయాలు మారి శివాలయాలైనట్లు శైవుల ఆలయాలు వైష్ణవుల ఆలయాలైనాయి, చిత్ర మేమిటీ?

—అక్షరాభ్యాసమూ, వ్రాతకి విరివియైన ప్రచారమూ, జైనులతో వచ్చాయేమో నని మనము మొదట పలికే "సిద్ధం నమః" అన్న మాటలు అనుమానము పుట్టిస్తాయి సంస్కృత సంప్రదాయము వర్జించడమేగాని రాసుకోడము కాదు. బౌద్ధులే మొదట లిపి ప్రచారము చేశారంటాడు రైజేవిడ్స్ తెలుగుదేశములో ఈ పని జైనులు చేశారేమో. శైవులు వీరి నణగదొక్కి, తమ మతానికి పునాదిగా "ఓం నమః శివాయః" అని ముందు మాటలు కలిపినారేమో, ఇది శోధించవలసిన విషయము.

—రాజమహేంద్రవరపు మసీదే చాళుక్య సీమలోని ప్రాచీన మసీదు అలూఫ్‌ఖాను అనే మహమ్మద్‌బిన్ తుగ్లకు రాజమహేంద్రవరాన్ని జయించి, దేవాలయాన్ని పడగొట్టించి మసీదుగా కట్టించాడు. 1323 లో నేటికే ఉన్న ఆ దేవాలయపు తరిమిణిస్తంభాలవల్ల అది కాకతీయుల కాలపు దేవాలయమనీ మూడు వంతులు శివాలయమనీ ఊహించవచ్చు. కాకతీయులు మొదట జైనులు. తరవాత శైవులైనారు వారి కాలములోని ఆలయాలు మూడు వంతుల ముప్పాతిక శివాలయాలే

—మనకి తెలిసిన సూక్ష్మజీవు లేవీ నిప్పులో లేవు

—ఒక పొడుగాటి తాడుని ఒక కొసకిటికీ ఊచకికట్ట రెండో కొసని పట్టుకుని పైకీ కిందకీ జోరుగా ఊగిసలాడిస్తే, కెరటములాంటి వంపులు బొమ్మలో చూపినట్టు తాటిమీద సాగిపోతాయి తాటికి స్థితిస్థాపకశక్తి ఉండడమువల్ల ఇది సాధ్యమౌతోంది. నీటిమీద పలచటి పొర ఉంటుంది నీటిలో ఒక రాతినివేస్తే అది తన బరువు ఈ పొరని అడుక్కి నొక్కుతుంది రాయి అడుక్కి దిగిపోగానే అడుక్కి దిగినభాగము రబ్బరులాగ పైకి వచ్చేసి ఊగిస లాడుతుంది. అందువల్ల పొర మీద అన్నివైపులకీ అల వ్యాపిస్తుంది.





మా తా శి శు వు లు

(భువనేశ్వర్ శిల్పానికి ప్రతిచిత్రం)—సి. ఇ. నెహ్రూ.

# ప్రేమలేఖ

(భువనేశ్వర్ శిల్పానికి ప్రతిచిత్రం)—కి. ఇ. నెహ్రూ



# రెండు రాళ్ల పెళ్లి ★

రచన:
"పతంజలి"

అల్లదిగో పల్లెటూరు
ఊరిచివర చెరువున్నది
గట్టుమీద చెట్టున్నది
చెట్టుక్రింద పుట్టున్నది
పుట్టవెనక రాళ్లు రెండు
వందేళ్లకు క్రితమే అవి
వెలిశాయని వాడుకుంది -
ఏటేటా ఆ రాళ్లకు
ఊళ్లో చేస్తారు పెళ్లి -
పెళ్లినాడు రాళ్ల వెనక
కథనంతా గాథలుగా
వింటారు విషాదంతో !

* * *

అలనాడే ఆ వాడను
తోడుగానె తిరిగినారు
ఆమె పేరు మల్లమ్మ
నాగయ్యంటా రతణ్ణి -
బావా మరదళ్లు వాళ్లు
పదేసేళ్ళలోపువాళ్లు
ఒకరినొకరు విడవలేరు
ఎంతో గారం వారికి -
ఆటా పాటల తోడు
తోటివాళ్లు తమ జోడు -
ముద్దుగాను యిద్దరికీ
పెళ్లనుకున్నారు పెద్దలు

* * *

అయ్యవారి అబ్బాయికి
పెళ్లి జరుగుతూన్న నాడె
తమ కెప్పుడో పెళ్లంటూ
ఉవ్విళ్లూరా రిద్దరు -
తోటిపిల్ల సీతమ్మే
తోడ పెళ్లికూతురైతె
తాను కూడ అవుదామని
తహతహలాడిం దెంతో -
ఆమె పెళ్లికూతురైతె
తానె పెళ్లికొడుకు గాక
తీరదనే భరోసాతో
ముసిముసిగా నవ్వె నతడు !

* * *

పంచాంగం చూశారు పెళ్లి
మాఘంలో అన్నారు పెళ్లి
ఊరంతా ఎంతో సందడి
వారంతా పెళ్లివారు -
ముచ్చటైన పిల్లాపిల్లడు
విచ్చిన పూలంటివారు
ఇచ్చగించి పెద్దలంత
ఇచ్చిపుచ్చుకోవటాలు -
అట్టే వచ్చింది సిగ్గు
ఇట్టే దాగింది మల్లి
త్రోవలోన బావా నే
కోవెల్లో దూరె తాను !

* * *

సంకురాత్రి పండగొచ్చె
బొమ్మల పెళ్లిళ్లైనవి
చెరువుగట్టు కెళ్లినారు
చేతబొమ్మ లట్టుకోని.
పెద్ద పేరటాలు తాను
మల్లికూడ బయల్దేరె -
'ఎవరికి వారే అంటూ -
యమునా తీరే అంటూ'
ఇళ్లకు తిరిగొచ్చినారు -
క్రమ్మినాయి చీకట్లు
నిలిచినారు వాకట్లో
దిగులాయెను పదుగురికీ !

* * *

మల్లిజాడ తెలియలేదు
పల్లె, వాడ వెదకినారు -
సెగలు రేగె తన హృదిలో
నీరసించె నాగయ్యా
తిండి లేదు; మఱియు లేదు
మల్లిని తను చేరాలని
పలవరించె కలలోనే -
బెదురునిండె నందరి ఎదలో !

* * *

వెర్రివాడు నాగయ్యా
నిలువలేకపోయె తాను -
మల్లిలాగ తను కూడా
చెరువుగట్టు చేరాలని
చెలికాళ్లతో చెప్పె తాను -
నాల్గురోజు లయ్యెనాక
'నాగ య్యేడంటే -
నాగయ్యే డంటూ'
నలుగురు తెగ తిరిగినారు.
కొండకోన వెదకినారు -
చెరువుగట్టు చివరితట్టు రేవునే
ఒరులు చూడ నాగయ్యా తేలెనే !
ప్రేవు కదలి బావురుమన్నాది తల్లి
పదిమందీ ఊరడించినారు వెళ్ళి

* * *

ఆ వెనకే వారిద్దరు
ఏటేటా కనుమునాడు
చెరువుగట్టు చెట్టునీడ
ఆటలాడి, పాటపాడి
పోతూంటారని వినికిడి -
పసిపాపలు, ముసలివారు
పండితులూ, పామరులూ
ఊళ్లో చేస్తారు పెళ్లి
రెండు రాళ్ల వెనక గాథ
గానం చేస్తా రక్కడ ! ★

బొమ్మరిల్లు సీరియల్

అద్దెబోటులో—

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

(గత సంచిక తరువాయి)

### 18

మరుసటిరోజు వుదయాన్నే 'స్ట్రీట్లీ' నుంచి బయలు దేరాం. 'కల్‌హాం' చేరాక, మా పడవని వుప్పుటేరులోకి పట్టించి, అక్కడ లంగరు వేసి, పడవలోనే పడుకొన్నాం. 'స్ట్రీట్లీ' మొదలుకొని 'వాలింగ్‌ఫర్డ్' చేరేదాక, నది చూడటానికి ఏమంత పెద్ద బాగుండదు 'క్లీవ్' దాటాక మళ్ళీ దాదాపు ఆరున్నరమైళ్లు వెళ్లితే కాని, ఒక్క లాకు అయినా కంటపడదు. థేమ్సునదిమీద మరెక్కడా యింత దూరంవరకు లాకుల్లేకుండా వుండదని విన్నాను. అంచేత నేకాబోలు, ఆక్స్‌ఫర్డుక్లబ్బువాళ్లు అప్పుడప్పుడు యీ ప్రాంతంలో పడవలపందేలు నడుపుతూవుంటారు.

పందేలలో పాల్గొనేవాళ్లకి, లాకులు లేకపోవటం బాగుంటే బాగుండవచ్చు కాని, మామూలుగా సరదాకోసం పడవప్రయాణం చేసేవాళ్లకి యింత దూరం వెళ్లేదాకా ఒక్క లాకు అయినా లేకపోవటం అనేది, చాలా యిబ్బంది అయినవిషయం.

నా మటుక్కి నాకు లాకులంటే మహా చెడ్డ యిష్టం. పడవ నడపటంలో వుండే చిరాకుని యీ లాకులు తగ్గిస్తుంటాయి ఎక్కడినుంచో వచ్చి వచ్చి లాకు తలుపులు తెరిచేదాక పడవలో కాచుకుకూర్చోవటం బాగుంటుంది. కిర్రుకిర్రులాడుతూ ఆ తలుపులు తెరుచుకొనేసరికి అంతవరకూ మనకి కనిపించకుండాపోయిన కొత్త ప్రపంచం ఏదో ఒక్కసారిగా మన ఎదుట సాక్షాత్కరించినట్లు అవుతుంది.

లాకులు బాగుంటాయి: అంతేకాకుండా వెనుకటి రోజుల్లో సామాన్యంగా యీ లాకులు కాపడటానికి లావుపాటి ముసలివాళ్లు కొందరు వుండేవాళ్లు. వాళ్లూ, వాళ్ల కుటుంబంలోని వాళ్ళు అందరూకూడా మంచి సరదా అయిన మనుషులు. (అదేమిటో— యిప్పటిరోజుల్లో లాకుమనిషి ఎవడినిచూసినా, ఎప్పుడు చూసినా మహా చిరాగ్గాజొపస్తాడు!) వాళ్లమాట ఎల్లావున్నా, కనీసం, ప్రతిలాకుదగ్గిరా బోలెడన్ని పడవలు పడిగాపులు కాస్తూవుండేవి. ఆ పడవల్లో వాళ్లతో ఎవరితోనైనా హాయిగా మాట్లాడుకోవచ్చు. ఒక్కముక్కలో చెప్పాలంటే—అంతపెద్ద థేమ్సునదిమీద అక్కడక్కడా 'కామాలు, సెమికోలన్‌ల'లాగా యీ లాకులే లేకపోతే పడవప్రయాణం ఎంత బాధాకరంగా వుంటుందో వూహించుకోనైనా వూహించుకోలేం.

ఇప్పుడేదో లాకులవూసువచ్చిందికాబట్టి, యిది వరకు ఒకసారి నాకూ జార్జికీ 'హాంపటన్‌కోర్టు' దగ్గర జరిగిన ఒక అనుభవం జ్ఞాపకానికి వస్తున్నది.

అది వేసవికాలం. వాతావరణం ఎంతో బాగుంది. 'హాంపటన్ కోర్టులాకు'దగ్గిర మా పడ

మూలం : జెరోమ్ కె. జెరోమ్



అనువాదం విశ్వాత్ముల నరసింహమూర్తి



# ముచ్చటగా ముగ్గురు



వతో పాటు యింకా చాలా పడవలు తలుపులు తెర వటంకోసం కాచుకొని వున్నాయి. మామూలుగా చూడండి—ఏనదిమీద చూసినా లాకులదగ్గిర ఎవడో ఒక ఫొటోగ్రాఫర్ ఫొటోలు తీస్తునేవుంటాడు: అలాగే ఆరోజునకూడా 'హాంపటన్ కోర్టు' లాకుదగ్గిర ఎవడో మా పడవలన్నిటినీ కలిపి ఫొటో తీస్తున్నాడు.

ఆ ఫోటోగ్రాఫర్ ని నేను ముందు చూడలేదు. నా ఎదురుగుండా కూర్చున్న జార్జి, వున్నట్లుండి కోటూ బూటూ సర్దుకోవటం మొదలుపెట్టాడు: తలా అదీ దువ్వుకొంటున్నాడు; టోపీతీసి తలమీద హాషుగా పెట్టుకొన్నాడు. ముఖంలో అదొక మాదిరి విచారంతో కూడిన వెర్రినవ్వు తెచ్చిపెట్టుకొని, బిర్ర బిగుసుకు కూర్చున్నాడు. కొంగకాళ్లలా అంత పొడుగునవుండే తన కాళ్లని దాచిపెట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.

వీడు యిదంతా ఎందుకు చేస్తున్నాడో నాకు మొదట బోధపడలేదు ఒడ్డుమీద పడుచువాళ్లు ఎవరైనా తిరుగుతున్నారేమోనని, అటువైపంతా వెతికాను. ఎటువైపుచూసినా ప్రతిఒక్కడూ కొయ్యబారి పోతున్నట్లు నాకు అనుమానంతగిలింది ఆడవాళ్లు అందరి మొహాల్లోనూ చిరునవ్వులు తాండవిస్తున్నాయి. మొగవాళ్లందరూ కళ్లూ పళ్లూ బిగబట్టి కొయ్యబొమ్మల వాటంలో కనిపించారు. ఇదంతా ఎందుకు యిలా జరుగుతోంది చెప్మా అనుకొన్నాను

చివరికెప్పటికో నాకు తెలిసివచ్చింది—ఎవడో ఫొటోగ్రాఫ్ తియబోతున్నాడని. అటువంటి పరిస్థితిలో నేనేం చెయ్యాలో నాకు బోధపడలేదు. వాళ్లందరిలాగే నేనూ అర్జంటుగా బిగుసుకుపోవాలేమో ననుకొన్నాను. అందులోనూ, మా పడవే అన్నిటికంటే ముందుపక్కన వుంది అటువంటప్పుడు నేనొక్కడినీ వేరుగావుంటే, అవతలివాడు తీస్తున్న ఫోటో తగలడినట్లు తయారుఅవుతుంది అలాచేస్తే వాడికి అన్యాయం చేసినట్లు ఔతుందనిపించింది.

గిరుక్కున వెనక్కి తిరిగి, ముందుకి కదిలి వచ్చి మాపడవ మొనమీాద ఏటవాలుగా కూర్చున్నాను ఆ కూర్చున్నపద్ధతిలో వీలైనంత హుందాతనం కనిపించేలా జాగ్రత్తపడ్డాను. తలమీాద వెంట్రుకలు ఒకటి రెండు ముందుకులాగి నుదురుమీాద పడేసుకొన్నాను. 'లోకంఅంటే నాకేం లెఖ్ఖ' అన్న ధోరణి కనిపించేలా మొఖం పెట్టేశాను. (నా మొఖం అలా వున్నప్పుడే బాగుంటుందని అందరూ అంటూవుంటారు!)

అంతా సిద్ధమైపోయి ఫోటో తీయడంకోసం అందరం కాచుకుకూర్చున్నసమయంలో, నా వెనక ఎవరో "అరె! ముక్కు!! ముక్కు!!" అని అరవటం మొదలుపెట్టారు. ఎవరిముక్కో, ఆ ముక్కుకి ఏమిటొచ్చిందో తెలుసుకోవాలంటే, వెనక్కి తిరగాలి: వెనక్కి తిరిగా ననుకోండి, అంతలో అవతల వాడు ఫొటో తీసేస్తే ఎల్లా? అక్కడికీ నా పక్కనే వున్న జార్జిగాడి ముక్కువంక ఓరచూపులు చూశాను. వాడి ముక్కులో కొత్తగావచ్చిన పేచీ ఏమీ లేదు. కొత్తగా యిప్పుడు యింత అర్జంటుగా వాడిముక్కులో చేయగల మార్పులు ఏమీ లేవు అతికష్టంతో రెండుకళ్లల్లోనూ మెల్ల తెప్పించుకొని నా ముక్కు మొన చూసుకొన్నాను, అందులో ఏమన్నా లోపంవచ్చిపడిందేమోనని! ఇదివరకు ఎలావుండేదో యిప్పుడూ అలాగే వుంది నా ముక్కులోనూ కొత్తగా వచ్చిన పేచీ ఏమీ లేదు.

"ముక్కు! ముక్కు!!...అడ్డగాడిదలా అలా నిలబడ్డావేం!" అంటూ మా వెనకనుంచీ మళ్లా ఎవరో బిగ్గరగా అరిచారు.

మరొకక్షణం ఆగి: "మీారే— కుక్కపక్కన నిలబడ్డ మీా యిద్దరినే— ముక్కుని కాస్త పక్కకి నెట్టలేరూ ?" అంటూ అదే కంఠం మళ్లీ వినిపించింది.

నేనుకాని, జార్జికాని వెనక్కి తిరిగిచూడ సాహసించలేకపోయాం. అవతల ఫొటోతీసేవాడు అప్పటికప్పుడే 'రెడీ' అనబోతున్నాడు. ఏ క్షణానఅయినా ఫొటోతీసెయ్యటం జరగవచ్చు. అలాంటి సమయంలో వీళ్లెవరో మమ్మల్నే నేనా పిలుస్తున్నారు? ఏం—మా ముక్కులకి ఏమైంది? వాటినెందుకు వెనక్కి నెట్టాలి?

నేను యిలా ఆలోచిస్తూ వుండగా మా వెనక నుంచి ఒక ఓ నవ్వు వినిపించింది. వందలకొద్ది మనుష్యులు ఒక్కసారిగా విరగబడినవ్వటం ఆరంభించారు ఈ నవ్వులను చీల్చుకొంటూ బొంగురగొంతుక ఒకటి వినిపించింది: "మీ బోటు ముక్కువంక చూడండి—మీరేనండీ—ఎర్రటోపీ పెట్టుకొన్న మిమ్మల్నే పిలుస్తూంట. ఇప్పటికైనా మీ బోటు ముక్కువంక చూసుకోకపోతే ఆ ఫోటోలో పడబోయేది మీ శవాలు కాని మీరు కాదు. జాగ్రత్త!"అని.

మే ముభయులమూ అప్పటికి వెనక్కి తిరిగి చూశాం. తీరా చూసేసరికి—యింకేముంది—మా పడవ మొన పోయి లాకుకి అడుగున పేర్చికట్టిన కొయ్యదుంగల్లో యిరుక్కొనివుంది. ఆ విధంగా పట్టుబడిపోవటంతో, పడవనిండా నీళ్లు వచ్చేస్తున్నాయి మా పడవ అప్పటికప్పుడే సగందాకా నీటిలో మునిగిపోయింది. మరొక్క క్షణంలో సాంతం మునిగిపోయేటట్లుంది. ఏం చెయ్యాలో ఆలోచించటానికి కూడా అవకాశం లేదు. మా యిద్దరి బుర్రల్లోనూ ఒక్కసారి మెరుపల్లే ఒకే ఆలోచన వచ్చింది. ఇద్దరమూ చెరొక తెడ్డూ తీసుకొని లాకు గోడకి గట్టిగా పట్టించి బలంగా ఒక్కసారి వెనక్కి వూపేశాం. ఆ వూపుతో లాకుగోడల్లో యిరుక్కుపోయిన పడవ మొనఅయితే వూడివచ్చింది కాని, అందులోవున్న మేముభయులమూ అమాంతం గాలిలోకి ఎగిరి వెల్లికిలాపడ్డాం

మొత్తానికి ఆ ఫోటోలో మేము ఏమీ బాగా పడలేదు. ('మేము' అంటే జార్జి, నేనూ అన్నమాట) ఇంతకీ మా దురదృష్టం అల్లావుండబట్టి కాని, లేకపోతే, సరిగ్గా మాకీ రసాభాసు జరిగినప్పుడే అవతల ఆ ఫోటోగ్రాఫరు కెమెరా నొక్కటం జరగాలా? అదేమిటో అందులో మేము కాళ్లు నాలుగూ పైకిఎత్తుకొని వెర్రివెంగళప్పల్లా పడ్డాం.

ఆ ఫొటో అంతటిలోకీ మా పాదాలే చాలా పెద్దవిగా పడ్డాయి నిజానికి అవి తప్పించి ఆ ఫోటోలో యింకేమీ కనిపించడంలేదు. మా కాళ్ల సందునుంచీ అక్కడక్కడా కాస్త సీనరీమాత్రం కనిపిస్తోంది. మిగిలిన మనుష్యులు, కోలెడంత పొట్టిగా కనిపిస్తున్నారు అంచేత ఆ ఫోటో కాపీలు ఎవరూ తీసుకోలేదు.

మొదట ఆరుకాపీలు కావాలని ఆర్డరుయిచ్చిన లాంచ్ యజమాని ఎవరో, తీరా ఫొటో తీసి నెగటివ్ చూపించాక, తనకేమీ అక్కరలేదు పొమ్మన్నాడట. ఆ ఫోటోలో ఎక్కడైనాసరే తన లాంచ్ వున్నట్లు ఎవరైనా ఋజువు చెయ్యగలిగితే, తను తప్పకుండా ఆ ఆరు కాపీలూ తీసుకోగలనన్నాడట ఆ లాంచ్ ఎక్కడ కనుపిస్తుంది?—జార్జి కుడికాలుచాటునవుంది!

మొత్తానికి ఫోటోగ్రాఫర్ పని అసందర్భంగా తయారైంది వాడుతీసిన ఫోటోలో పదింట తొమ్మిది వంతులు మేమే ఆక్రమించుకొన్నాం కాబట్టి, మేమిద్దరమూ కనీసం చెరొక డజను కాపీలు అయినా తీసుకోక తప్పదని వాడు పట్టుపట్టాడు. మేము ఒప్పుకోలేదు. పదింట తొమ్మిదివంతులేకాదు, పదింట పదివంతులూ మమ్మల్నే తీసినా మాకేమీ అభ్యంతరం లేదనీ, అయితే-తీసేది సరిగా నిలబడ్డప్పుడు తీస్తేనే ఒప్పుకొంటాం కాని, యిలా కాళ్లు ఎత్తేసిన సందర్భంలో ఫొటోతీసి కాపీలు కొనమంటే కొనమనీ గట్టిగా చెప్పేశాం.

ఆ కథ అంతటితో వదిలేసి మా ప్రస్తుత ప్రయాణాన్ని గురించి చెప్తాను మరుసటిరోజు వుదయాన్నే నిద్దర లేచాం. మధ్యాహ్నంలోగా ఆక్స్ఫర్డుకి చేరిపోదామనుకొన్నాం. ఇలా ప్రయాణాలు చేస్తున్నప్పుడు ప్రతివాడికీ పెందరాడే నిద్ర మెళుకువ వచ్చేస్తుంది. కొయ్యపడవలో పడుకొన్నవాడెవ్వడూ ఒక్కసారి నిద్రమెళుకువ వచ్చాక, మరొక ఐదునిమిషాలు పడుకొని లేద్దామని బద్ధకించడు నిద్రలేచీ లేవగానే మొఖాలు కడుక్కొని, ఫలహారాలు పూర్తిచేసి లంగరు ఎత్తాం పొద్దున ఎనిమిదన్నర అయ్యేలోగా 'క్లిఫ్టన్ లాక్' దాటివచ్చేశాం.

'క్లిఫ్టన్'నుంచి 'కల్హాం' వరకు నదీతీరాలు చూడటానికి అంత బాగుండవు.

'ఎబ్బింగ్డన్' దగ్గర నది ఆవూళ్లో వీధులని ఆనుకొని ప్రవహిస్తుంది ఊరుకూడా చూడటానికి చాలా గౌరవనీయంగా వుంటుంది అక్కడ యిదివరలో చాలా పురాతనమైన చర్చి ఒకటి వుండేది. అటువంటి పవిత్రమైన చోట జనం యిటీవల బట్టీలు పెట్టి నిత్యం సారా కాస్తున్నారు.

'ఎబ్బింగ్టన్' దగ్గరనుంచి 'న్యూన్హామ్ కోర్ట్నీ' వరకు నది మళ్ళీ చాలా బాగుంటుంది.



# ముచ్చటగా ముగ్గురు



'న్యూన్‌హామ్‌పార్క్' నిజంగా చాలాఅందమైనపార్కు.

'సాండ్‌ఫర్డ్' లాకుకి పక్కగానే చిన్న నీటి కుంట ఒకటి వుంది ఆత్మహత్య చేసుకోదలచినవాళ్ళకి అది చక్కనిచోటు. అక్కడ నీటి వేగం చాలా ఎక్కువ. పైకిమాత్రం అదేమీ కనిపించదు. తెలిసో తెలియకో దిగామా అంటే యిక అంతే! ఇదివరకెవరో యిద్దరు స్నానం చెయ్యటానికి దిగి, అందులో పడి చచ్చిపోయారు. ఆచోటు గుర్తు తెలియటంకోసం అక్కడ ఒక చిన్నికర్రపలక నాటటంకూడా జరిగింది.

'ఆక్స్‌ఫర్డ్' ఇంకొక మైలుదూరంలో వుందనగా 'ఇఫ్లీ'లాకు, మిల్లు ఎదురౌతాయి ఈ మిల్లునే కుంచె పట్టిన సోదరు లెందరో చిత్రించారు. బొమ్మల్లో మిల్లుని చూసిచూసివున్న మీదట, అసలు మిల్లు చూడటానికి చాలా అందవికారంగా కనిపించింది. దీన్నిబట్టి నాకు ఒకటి అనిపిస్తుంది—ఈ సువిశాల పృథ్విలో బహుకొద్ది వస్తువులు మాత్రమే చిత్రాల్లో కనిపించేటంత అందంగా యితరత్రాకూడా వుండగలవేమో!

మధ్యాహ్నం పన్నెండున్నరకి కాబోలు—మాబోటు 'ఇఫ్లీలాకు' దాటింది. పడవఅంతా శుభ్రం చేసి చివరిమైలు ప్రయాణానికి సిద్ధంగా పెట్టుకొన్నాం.

నాకు తెలిసినంతమటుకు ఇఫ్లీలాకుకీ ఆక్స్‌ఫర్డుకీ మధ్యవున్నంత దరిద్రంగా పడవప్రయాణం యీ థేమ్సు నదిమీద మరెక్కడా వుండదు. ఆకష్టం ఏదో మీకు బోధపడాలంటే, మీరు అక్కడ పుట్టి పెరిగినవాళ్లు అయితేతప్ప కుదరదు. అంతఎందుకు—ఆప్రాంతంలో యిప్పటికి యిన్నిసార్లు నేను పడవప్రయాణం చేసినప్పటికీ, అక్కడ నదీ జలానికి ఏం మాయరోగం వస్తుందో నాకీరోజుకీ బోధపడలేదు. ఆక్స్‌ఫర్డునుంచి 'ఇఫ్లీ'వరకు సూటిగా పడవ నడపగలిగినవాడెవడైనా వుంటే, వాడు నిజంగా యీ సంసారసాగరాన్ని అవలీలగా దాటగలిగిన దిట్టగా మనం పరిగణించవచ్చు

అక్కడ ఏం జరుగుతుందంటే—నదీప్రవాహం ప్రతి పడవని ముందు కుడిగట్టుకి కొట్టేస్తుంది. అక్కణ్నుంచి ఎడమ గట్టుకి తోసేస్తుంది. మళ్ళీ నట్టనడానికి లాక్కొచ్చి అక్కడ కాసేపు గిరగిరా గింగిరాలు తిప్పేస్తుంది. ఇలా చేసిచేసి చివరికి, అక్కడ కాలేజీవాళ్లు నదిలోకి కట్టిన గోడమీదికి విసిరేస్తుంది.

ఇటువంటి పనులన్నీ అక్కడి ప్రవాహం చేస్తుంది కనుకనే మా పడవ అనేకమైన యితర పడవలదారులకి అడ్డం తగిలింది; మా పడవకీ అనేకమైన పడవలు అడ్డం వచ్చాయి. ఇలాంటివి జరిగినప్పుడు మన నోట్లోనుంచి బండబూతులు రాక తప్పవు కాబట్టి, ఆరోజు మేమూ చాలా బూతులు ప్రయోగించామని చెప్పక తప్పదు.

అలా ఎందుకు జరగుతుందో చెప్పలేం కాని, మామూలుగా నేలమీద వుండేటప్పుడు మేకలా వుండే మనిషి కూడా పడవ ప్రయాణంలో మహాదురుసుగా తయారైతీరుతాడు. నేలమీద వున్నప్పుడు లెక్కచెయ్యని చిన్నచిన్న తప్పులు కూడా, పడవలోకి ఎక్కేసరికి ఘోరమైన నేరాలుగా అవుపిస్తాయి. ఉదాహరణకి మా విషయమే తీసుకొందాం మామూలుగా ఒడ్డున వున్నప్పుడు జార్జిగాని హారిస్సు కాని చిన్న తప్పు ఏదైనా చేస్తే, నేను చిరునవ్వు నవ్వి వూరుకొంటాను అటువంటిది బోటులోకి ఎక్కేసరికి నాకు ఎక్కడలేని చిరాకూ వచ్చేస్తుంది. వాళ్లు ఎంత చిన్న తప్పు చేసినా కూడా సహించలేను వాళ్ళని పట్టుకొని అనరాని మాటలన్నీ అనేస్తాను నేను ఎక్కిన పడవకి అడ్డంగా మరొక పడవ ఏదైనా వస్తే ఆ పడవ నడిపేవాడి బుర్రని ఒక్క వేటుతో చితకకొట్టుదామనిపిస్తుంది ఇది నా ఒక్కడి విషయంలోనే కాదు: అందరి విషయంలోనూ యిలాగే జరుగుతుంది.

ఇదివరకు ఒకసారి నేను ఒక ఆడామెతో కలిసి పడవప్రయాణానికి వెళ్లాను. ఆవిడ నిజంగా నోట్లో నాలిక లేని మనిషి. ఇంట్లో వున్నప్పుడు కటువుమాట అనేది ఆవిడ నోట్లోనుంచి వస్తుందనికూడా ఎవరూ అనుకోలేరు. అల్లాంటి ఆమె—అదేమి చిత్రమో—బోటులోకి ఎక్కిన క్షణాన్నుంచి పూర్తిగా మారిపోయింది మా పడవకి అడ్డం వచ్చిన ప్రతి పడవనీ, ఆ పడవల్ని నడిపే మనుషుల్నీ అనరాని మాటలన్నీ అప్రయత్నంగా అనేసింది.

మొత్తానికి నదిమీద వీచే గాలిలోనే మనుష్యుల నైతిక విలువల్ని కదిలించివేసే శక్తిఏదో వున్నదేమో!

(ఇంకా వుంది)

# నా పరీక్ష

పల్లెటూరు అవటమువలన మా వూళ్లో మూడవ ఫారమువరకే చదువున్నది. మా అన్నయ్యకీ మా నాన్నగారికీ ఆడవాళ్లు చదువుకోవడం ఇష్టం. అదీ కాకుండా నాపట్టుదలకూడ నా పై చదువుకి కొంతపనిచేసింది. ఎల్లాగయితేనేం నేను పట్నంలో మా పినతండ్రిగారింట్లో చదువుకున్నాను.

కె. కావేశ్వరి



"అయినా ఆడవాళ్లకీ చదువేమిటి! కాలం మారిపోయింది.

నేను స్కూల్ ఫైనల్ పరీక్షలు రాసి అప్పుడే ఇంటికొచ్చాను. మా అక్కయ్య తప్పించి, నన్ను అందరూ "బాగా రాశావా" అని అడిగారు. మా అక్కయ్యకీ నాకూ ఎప్పుడూ పొత్తుకుదురదు. మాఇద్దరికీ మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. నేనేమన్నాఅంటే అది ఊరుకోకూడదుటగానీ, అది పెద్దది గనుక అది ఏమన్నా అంటే నేను ఎదురు చెప్పగూడదుట. మాఇంట్లోవారందరూ ఇలాగే అంటారు. కాని నాకుమాత్రం దానిపెద్దతన మేమీ కనపడదు. కనుక దానితో సమానంగా నేనూ జగడంవేసుకుంటాను.

ఆవేళకి నాలుగు రోజులనుంచే నేను పరీక్షా ఫలితాలకోసం ఎదురు చూస్తున్నాను. ఆరోజున మామూ

(54-వ పేజీ చూడండి)

# చుట్టాలు

అవి మంచి కరువు రోజులు. ఆ కరువు రోజుల్లోనే శ్రీరామ నవమి వచ్చిపడింది! అసలు ఈ పండగంటే రాజమండ్రి పట్టణమంతా హడావిడిగా ఉంటుంది. ఊరంతా పందిళ్లు వేసి కళ్యాణం జరుపుతారు. సంగీత కచేరీలు, హరికథలు ఒకటేమిటి అనేకం వుంటాయి. పందిళ్లు జనంతో కిక్కిరిసిపోయి వుంటాయి. పండగ పేరు చెప్పి అనకాపల్లి నుంచి అయిదుగురు చుట్టాలు వూడిపడ్డారు మాయింటికి. అంతదూరమునుంచి వచ్చారుకదా అని ఏదో మర్యాద చేదామంటే, అప్పుడు మా నాన్నగారి చేతిలో డబ్బు లేదు. ఇంట్లో బియ్యము లేవు. ఆ వారానికి తెచ్చిన బియ్యము అర్థశేరు మాత్రమున్నాయి. రేపను యిచ్చే వాయిదా ఇంకా నాలుగురోజులుంది. మానాన్నకు ఏమీ తోచలేదు. మా అమ్మనుపిలిచి 'ఏమిటి చెయ్యడం' అని అడిగారు.

"పొరుగింటోళ్ళే సర్దుకుంటారంటే, మనకేమిస్తారు? తెలిసుండీ వాళ్ళని ఎలాగ అడగనండీ? అయినా వచ్చినచుట్టాలు మీతరఫు వాళ్ళేగా! నాకేం తెలుస్తుంది? ఆ బరువుమాత్రం నామీద పడెయ్యకండి" అంది అమ్మ

[illegible] శ్రీరామ [illegible]

సరిపోయింది యింక ఎలాగ? నాన్నగారు ఆలోచించారు. నాకు చుట్టాలమీద కోపంవచ్చింది రేపన్రోజులనైనా ఆలోచించకుండా పెద్ద బలగంవచ్చి కూచున్నారు.

ఇంతలో మానాన్నగారికి ఏదో ఉపాయం తట్టినట్టుంది. హుషారుగా పిలిచారు మాఅమ్మని.

"ఎందుకండీ పిలిచారు మళ్ళీ" అంటూ వచ్చింది అమ్మ.

"ఇంట్లో ఏమాత్రం బియ్యమున్నాయి?" అని అడిగారు

"అర్థశేరు" అని నిక్కచ్చిగా చెప్పేసింది మాఅమ్మ.

"సరే నువ్వు యీ బియ్యం మాత్రమే వండు చాలు. పప్పుచారు కాచు" అన్నారు.

"అమ్మా, నాన్నకి నెత్తిమీద ఒక్క వెంట్రుకైనా లేదేం?"

"ఆయన గొప్ప తెలివైనవాడుకదూ. తెలివైనవాళ్లకి దబ్బున బట్టతల వస్తుంది."

"అయితే, నీకు అంత పెద్ద జుట్టుందేం?"

"ఎందుకంటే - ఛీ, అవతలికిపో వెధవప్రశ్నలూ, నువ్వూను."

"అదేమిటండి సరిగ్గా అబ్బాయికీ మీకేనా చాలదు వీళ్లందరి మాట ఏమిటంటారు?" అంది.

మానాన్నగారు "అదేనే పిచ్చిదానా, ఇక్కడే వున్నాయి తెలివితేటలు వీళ్లకతగిన శాస్తిచెయ్యాలి. బంధువులూ వద్దు ఎవరూ వద్దుగాని ముందు వీళ్లని సాగనంపితేనేగాని నాకు మనసుకుదటబడదు. అదంతా నీకెందుకు? వాటితో నీవంటు. నేను చెప్పినట్టుచేయి చెప్తాను వడ్డింగడంలో ముందు నా దగ్గరనుంచే మొదలుపెట్టి వడ్డించు సుమా? మర్చిపోకు" అన్నారు

ఒక అరగంటలో వంట అయిపోయింది భోజనానికి బంధువుల్ని లేవమన్నారు. అంతా స్నానాలు చేసివచ్చి పీటలమీద ఆసీనులయారు.

మానాన్నగారు ప్రారంభించారు లెక్చర్. "ఈవూరు, పట్టణమన్న

మాటేగాని ఏమీ సదుపాయ ముండదండీ" అన్నారు.

"అలాగేనండీ, అవుతుండీ," అంటూ వంతపాడ్డం మొదలుపెట్టారు చుట్టాలు. మాటల్లోనే, మా అమ్మ పళ్లెంతో అన్నం తీసికొచ్చింది. భయంతో నాన్నగారి వంక చూసింది. చూసి నిర్ఘాంత పోయింది. నాన్నగారు తనకేం తెలియనట్టు చుట్టాలతో కులాసాగా కబుర్లు చెప్తున్నారు మా అమ్మకి కంగారు పుట్టింది. అన్నం పళ్లెంతో దగ్గరికి వచ్చింది.

"వడ్డించు. ఇంక ఆలస్యమెందుకు" అన్నారు నాన్నగారు.

అమ్మకి చేతులు వణుకుతున్నాయి. నాన్నకి ఒక గరిటఅన్నం వడ్డించింది. రెండవసారి వేయబోయింది.

"అకే? అదేమిటే. అలా వేస్తున్నావు? మమ్మల్ని మనుష్యుల్లో జమ కట్టేవా, లేక పోతురాజు లనుకున్నావా? మాది కడుపు అనుకున్నావా కంబాళి మడుగు అనుకున్నావా. చాలు చాలు తియ్యి ఇంతకన్నా ఎక్కువ ఏ బకాసురుడు తింటాడని!"

ఈమాటలకి చుట్టాలంతా ఒక్కసారి అదిరిపడ్డారు. మా అమ్మకు యిదేమీ అర్థం కావడం లేదు. రెండవవానికి వడ్డించడము మొదలుపెట్టింది. వడ్డన మొదలుపెట్టగానే "చాలమ్మా చాలు, ఇంతకన్నా ఎక్కువ మేముమాత్రము ఏం తినగలం" అంటూ ఒక్కొక్క గరిటతోనే సరిపెట్టేశారు, అయిదుగురూను! ఇంకా వేసుకుంటే నాన్నగారు ఎగతాళి చేస్తారనో, లేక యీ పూరి పద్ధతి యింతేననుకొనో, ఏమో. గప్ చిప్ మని, మంచినీళ్ళు అడగకుండా లేచిపోయారు.



"బంధువులూ వద్దు ఎవరూ వద్దు గాని ముందు వీళ్లని సాగనంపితేనే గాని మనసు కుదుటపడదు "

సరే నేను తీసుకొచ్చి ఇచ్చిన కిళ్ళీలు నములుతూ, "వెళ్లొస్తామండీ" అన్నారు.

"అబ్బే దూరమునుండి వచ్చారు. రెండురోజులు వుండండి" అన్నారు నాన్నగారు.

"అలాంటే కాదండీ, ఈ రాత్రి అంతా శ్రీరామనవమి పందిళ్లన్నీ చూచి, పాసింజర్ లో వెళ్ళిపోతాము" అన్నారు చుట్టాలు.

"సరే మీ యిష్టం" అన్నారు, పెద్ద ఆపేక్షతో నాన్నగారు.

మా అమ్మ యిదంతా చూచి, "ఎంత ఆలోచన చేశారండీ. అన్నం ఇంకా మిగిలిపోయిందండీ అబ్బాయికీ నాకూ కూడా సరిపోతుంది", అంది.

నాన్నగారు చిలిపిగా చూస్తూ "ఏమనుకున్నావు మరి ? మళ్ళీ వీళ్లు రాజమండ్రీ వస్తే వట్టు వచ్చినా మనింటికి రారింక" అన్నారు. ★

# పెళ్ళి చూపులు

పరీక్షలు అయిపోయాయి. సంవత్సరమంతా కష్టపడి చదివిన విద్యార్థులంతా పరీక్షాఫలితాల కోసం వేయికళ్ళతో ఎదురు చూస్తున్నారు.

"నిండుకుండ తొణకదు" అన్నట్టుగా బాగా చదివి, పరీక్షలో బాగా వ్రాసిన విద్యార్థిని "ఏమోయి ప్యాసవుతావా?" అని అడిగితే "ఏమో చెప్పలేనండి" అంటాడు. మధ్యరకం విద్యార్థులు అంటే అత్తెసరు మార్కులు వచ్చే విద్యార్థులనడిగితే, వారు మనమీద సవాల్ కూడా చేస్తారు. "నేను ప్యాసవకపోయినట్లయితే మదరాసు రాజధానిలో ఎవరూ ప్యాసవరు" అంటూ ప్రగల్భాలు కొట్తారు. యిది సహజంగా ప్రతి మామూలు విద్యార్థి అనే మాట. తను ఎల్లాగూ ప్యాసవడం కల్ల, పోనీ ఫలితాలు వచ్చేదాకా అయినా నలుగురిలోనూ ప్యాసవుతాడేమో అనే సస్పెన్సు పుట్టించడం వారి అలవాటు.

మోహనరావు స్కూలుఫైనలు పరీక్షవ్రాశాడు. ఎంత చదివినా, చదివినది, బుర్రలో యిముడ్చుకోలేని అసమర్థుడు. పాపం!! సంవత్సరమంతా గడియారం అలారం కొట్టినపుడల్లా లేచి, లాంతరులో కిరసనాయిలు అయిపోయేదాకా చదివేవాడు. ఈలాగ సంవత్సరమంతా గడిపి పరీక్షలుబాగా వ్రాశాననే ఆత్మసంతుష్టితో కూర్చున్నాడు. తల్లికూడా కొడుకు ప్యాసవుతాడనే ధీమాతో, తన కొడుకును గురించి నీలాటిరేవులో నలుగురి అమ్మలక్కలతోటి ఘనంగా చెపుతుండేది.

అయ్యగారి
వెంకటసుబ్బారావు

ఆ రోజు టపాలో మోహనరావుతండ్రి రామారావు గారికి, మదరాసునుంచి ఒక వుత్తరం వచ్చింది. ఆ వుత్తరం మోహన్‌రావుకి ఆశ్చర్యం, ఆనందంకూడా గల్గించింది.

"రామారావుగార్కి — నమస్కారములు మీరు చెప్పిన పెళ్ళికూతురు యిక్కడనే వుంది. పెళ్ళిచూపులికి తరలిరావలెను. మీ రాకకై నిరీక్షిస్తుంటాను" అని వ్రాసినవుత్తరం మోహనరావు తదేకదీక్షగా అధమం లేదంటే పదిసార్లయినా చదివివుంటాడు.

ఆ వుత్తరం వాళ్ళకే వచ్చిందో, పొరపాటున పోస్టుజవాను వారికిచ్చాడో అని అనుమానం కలిగి వుత్తరాన్ని వెనక్కి త్రిప్పి చిరునామా చూచాడు. వాళ్ళ నాన్నగారికొచ్చిందే, సందేహంలేదు.

"పెళ్ళీడుకొచ్చిన మొగపిల్లలు ఎవరూలేర్నే, నేను తప్ప. ఏమిటి? ఈ పెళ్ళి సంబంధం ఎవరికైనట్టు? నాతో సంప్రదించకుండానే నాన్నగారు నాకు పెళ్ళి నిశ్చయిస్తారా? సూచనప్రాయంగానైనా, ఏ సందర్భంలోనూ కూడా నాన్నగారు నాకు చెప్పలేదే! పెళ్ళివారిది ఏ వూరో, అనుకుంటూ మళ్ళీ వుత్తరం కేసి చూచాడు. అది మదరాసు నుంచి వచ్చింది. అతనికి కొంచెం సంతోషం కల్గింది, బస్తీపిల్ల పెళ్లాం కాబోతుందంటే. "నవనాగరికురాలైయుంటుంది. ఎంతవరకు చదివిందో? పిల్లనుగురించి ఏమీ వివరాలువ్రాయలేదే. ఎరుపో-నలుపో-చామనచాయో—అసలు ఈ పెద్దవాళ్ళకి యిటువంటి విషయాల్లో మెదడు కొంచెం మందకొడిగా పని చేస్తుందేమో! ఈ కార్డు వ్రాయకపోతే, ఫోటోతోసహా పూర్తి వివరాలు వ్రాయకూడదూ ఒక కవరులో. అయినా నాన్నగారికింత కంగారెందుకో, యింకా పరీక్షా ఫలితాలనైనా ప్రకటించలేదు. అపుడే పెళ్ళికేం తొందర వచ్చింది." అనుకుంటూ గోడగడియారంకేసి చూచాడు. టంగ్! టంగ్!! టంగ్!!! మని మూడు గంటలు కొట్టింది.

ఇంతలోకే మోహన్‌రావు తల్లి గంగమ్మగారు కాఫీకప్పుతో మోహనరావెదురుగుండా ప్రత్యక్షమయింది. పొగలుగ్రక్కుతూన్న వేడి వేడి కాఫీని మోహనరావు

త్రాగుతూ, గంగమ్మగారివంక ఏదో అడగాలని చూచాడు యింతలోనే గంగమ్మగారు తన సంభాషణ ఉపక్రమించింది.

"కళ్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు. నీకు ఈ సంవత్సరమే పెళ్ళిచేద్దామని మీ నాన్నగారికి, నాకూకూడ వుంది. మంచివి, పెద్దవి సంబంధాలు వస్తున్నాయి. నీ వుద్దేశ్యంకూడా కనుక్కొని, పెళ్ళి నిశ్చయిద్దామన్నారు మీనాన్న. మొన్న మదరాసు నుంచి వచ్చిన పెద్దమనిషి మీ నాన్నగారు ఒప్పుకునేదాకా వెళ్ళ లేదు. మరి నీ వుద్దేశ్యం ఏమిటిరా"

"నా వుద్దేశ్యానికి ఏముందమ్మా... యింకా స్కూలుఫైనలయినా పూర్తికాలేదు... వుద్యోగం, సద్యోగంలేని నాకు ఓ గుదిబండను తీసుకొచ్చి మెడకుకట్టడం ఏమంత సమంజసమమ్మా" అన్నాడు మోహన్ వుద్యోగం లేదనే నిరుత్సాహంతో.

"అదేమిటిరా అలా అంటావు పెళ్ళిళ్ళుచేసుకునే వాళ్ళంతా వుద్యోగాలు చేస్తున్నారాయేం? ఎల్లకాలం వుద్యోగం లేకుండానే వుంటావా! స్కూలుఫైనలు ప్యాసవగానే ఏదోపరీక్ష వుందట ఆ పరీక్ష ప్యాసవుతే గవర్నమెంటు వాళ్ళే కళ్ళకద్దుకొని వుద్యోగం యిస్తారుట. అయినా నాకు తెలియక డుగుతా, మొన్న సాంబయ్యగారబ్బాయికి ఏం వుద్యోగం వుందని పెళ్ళిచేశారు? ఎనిమిదో క్లాసు మూడు సంవత్సరాలు పోయి యింట్లో కూర్చున్నాడు. అటువంటి వాడు పెళ్ళిచేసుకోగా లేంది నీకెందు కొచ్చిందిరా ఈ ధర్మసందేహం" అంది గంగమ్మగారు.

"అమ్మా! ఎవరో చేశారని మనంకూడా అలా చెయ్యడం భావ్యమా! వాళ్ళకి వెనకాల ఎకరాలున్నాయి. మనకేముంది. సూదిమోపెనంత భూమి కూడా లేదు. రెక్కాడితే డొక్కాలు నింపుకునే మనబ్రతుకులను వాళ్ళతో పోల్చుకోవడం ఎందుకమ్మా! అసలు... ఈ మదరాసు వాళ్ళెవరు?" అన్నాడు కొంచెం పెళ్ళికూతురునిగురించి తెలుసుకోవాలనే ఆతురతతో.

"ఆయన పేరుమోసిన ప్లీడరుగారు మదరాసులో. ఆయనకి వెనకాల పది ఎకరాలదాకా ఆస్థి వుంది ఆయన కూతురు పేర నాలుగు ఎకరాల మాగాణిభూమి వుందట పెళ్ళి సందర్భంలో వరుడికి నాలుగువేల రూపాయల కట్నం, పట్టుబట్టలు, వెండికంచం, వెండి చెంబు యిస్తారుట. పిల్లకూడా గుణవంతురాలు, బుద్ధిమంతురాలు అందకత్తె కూడానట మరి యిటువంటి సంబంధం కాళ్ళదగ్గరకొచ్చినప్పుడు కాదని కాలదన్నుకోడం మంచిదా? ఈవాళో రేపో వుత్తరం వ్రాస్తానని, పెళ్ళిచూపులికి వెంటనే రావలసిందని, మరీ, మరీ నొక్కిచెప్పి వెళ్ళాడాయన. అడగటం మర్చిపోయాను. పోస్టాఫీసుకువెళ్ళి మనకేమైనా వుత్తరాలు వచ్చాయేమో కనుక్కోనిరా" అంది గంగమ్మగారు.

మోహనరావుకి పెళ్ళంటే లోలోపల ఆనందంగా వున్నా పైకి మాత్రం మేకపోతుగాంభీర్యంగ మాట్లాడుతున్నాడు. గంగమ్మగారు వుత్తరం అన్నమీదట మదరాసునుంచి వచ్చిన వుత్తరాన్ని తల్లిచేతి కందించి "యిదిగో అక్కడనుంచే వచ్చింది" అన్నాడు.

"ఆ! వచ్చిందా. మరి చెప్పవేం యిందాకటి నుంచి... నాకేం తెలుసు ఆ ఆలు రానిదాన్ని కాస్త నువ్వే చదివి వినిపించు" అంది, సంతోషంతో. మోహనరావు వుత్తరాన్ని తీసుకొని, శ్రీరామ మొదలు చిత్తగించవలెను దాకా ఒక అక్షరంకూడా పొల్లుపోకుండా చదివి వినిపించాడు. కొడుకు వుత్తరం చదువుతూ వున్నంతసేపు గంగమ్మగారు ఆనందసాగరంలో మునిగి తేలిపోయింది. యింతల్లో గుమ్మంలోంచి ఒకావిడ "గంగమ్మగారూ!..." అంటూ పిలిచింది.

"రండి కామాక్షమ్మక్కా" అంటూ గంగమ్మగారు లోపలకి ఆహ్వానించింది.

"ఈలా చూడండి కామాక్షమ్మక్కా. మా వాడికి ఈ సంవత్సరం పెళ్ళిచేద్దామనుకుంటున్నాం. సంబంధాలుపైన సంబంధాలు, వచ్చిపడుతున్నాయి. మేం నాలుగు వేలు యిస్తామని, మేం అయిదు వేలు యిస్తామని పీక్కుతింటున్నారు. మా పిల్లాడిచదువు పూర్తయ్యేదాకా మేం పెళ్ళిచెయ్యమంటున్నా వినక మమ్మల్ని నిర్బంధిస్తున్నారు" అంది గంగమ్మగారు గుక్క త్రిప్పకుండా

"శుభస్య శీఘ్రం... కానిచ్చెయ్యండి. అనువైన సంబంధాలు

దగ్గరకొచ్చిన బేరం కాశీకి వెళ్ళినా దొరకదట. మదరాసునుంచి వచ్చారు. నాలుగువేలు కట్నం. పిల్లపేర నాలుగెకరా లున్నాయి. మా వాడికి యిందాకటినుంచి నూరిపోస్తున్నా. వాడు నాకు వుద్యోగం లేదు పరీక్షాఫలితాలు రావాలి అంటూ వెర్రి వెర్రి వేషాలు వేస్తున్నాడు. ఈ సంబంధం మంచిది కాబట్టి ఈ నెలలోనే ముహూర్తంపెట్టి పెళ్ళి చేసెయ్యాలని వుంది”

“అదేమిటి కుఱ్ఱాడుకనకనా మనం చెప్పడానికి యిరవై సంవత్సరాలు మీదపడ్డాయి......” అన్న కామాక్షమ్మగారి మాటకు అడ్డు వచ్చింది గంగమ్మగారు.

“అబ్బే యింకా యిరవై రాలేదు. మొన్ననే పదిహేను వెళ్ళి పద్ధెనిమిదో ఏడు వచ్చింది”

“అదేలెండి యిరవై కాకపోతే పద్ధెనిమిది” అని సమర్థించుకుంటూ కామాక్షమ్మగారు వుపన్యాసాన్ని ప్రారంభించ పోతుంటే, ఆవిడ కొడుకు గిరి వచ్చాడు.

“ఏహోయ్ మోహన్, యింకా కూర్చున్నావేం... రావోయి పోదాం” అన్నాడు వచ్చీరావడం తోనే

మా వాడికి ఎప్పుడూ షికార్లు, సినిమాలు, నాటకాలు. చచ్చిపోతున్నా బాబూ వీడితో వేగలేక” అంది కామాక్షమ్మగారు విసుగుతో. గిరి పిలవడంతోనే మోహన్‌రావు లేచి షైరుకని బయలుదేరాడు యింతలో గంగమ్మగారు మోహనరావు నాపి,

వెలుగు నీడల్లో వలల జాడ

ఫొటో — పి. జనార్దనరావు (మద్రాసు)



# పెళ్ళిచూపులు



వచ్చినపుడు ఆలా అనకూడదు మనం. ఈ నెలలోనే మంచి ముహూర్తా లున్నాయి కాని

చెయ్యండి” అంది కామాక్షమ్మ గారు

“అదే నేనూ అంటున్నా. కాళ్ళ

గిరితో సంబంధంవిషయం మళ్ళీ ఏకరువుపెట్టి, "మావాడికి కొంచెం చెప్పు నాయనా బొత్తిగా యింగిత జ్ఞానం తెలియనివాడు" అని చెప్పి కామాక్షమ్మ గారితో అప్పడాలు, వడియాల విషయంలోకి దిగింది. వీళ్ళ హడావిడికి గిరి నవ్వుకొని పైరుకని బయలుదేరాడు మోహన్‌తో.

"ఏరా! మంచి సంబంధంవస్తే కాదంటున్నావట" అన్నాడు గిరి.

"అబ్బే లేదురా......" అని నసిగాడు మోహన్.

"వూరుకోరా నీసంగతి నాకు తెలియదటగాని గుండెమీద చెయ్యి వేసుకొని చెప్పు, ఈ సంబంధం నీకిష్టంలేదని, ఈ పెళ్ళి నేనాపు చేయిస్తాను. ఎవరో మెచ్చుకుంటారని సుఖాన్ని పోగొట్టుకుంటార్రా ఎవరైనా. ఒరే! నామాటవిను ఈ సంబంధం అన్నివిధాలా తగింది. నువ్వు "ఊ" అంటే అంతావాళ్ళే తంటాలు పడతారు. నారు వేసిన వాడు నీరు పోయుడురా నీ భ్రమ కాని"

"అది కాదురా......"

"అదికాదు యిదికాదు నువ్వు ఒప్పుకొని తీరవలసిందే ఈ సంబంధానికి. అసలు సంగతి మర్చిపోయాను. కట్నమెంతరా".

మోహన్‌రావుకి వాడుచెప్పే మాటలు అర్థంగావట్లేదు. వాడిమాట వాడిదేకాని ఎదుటివాడు చెప్పుతున్న విషయాన్ని గ్రహించటం లేదు.

"నాలుగువేలు......"

"నాలుగువేలే! యింకా చూచావట్రా స్కూలుఫైనలు గ్రాడ్యుయేట్‌కి నాలుగువేలు యిస్తున్నారంటే నీకు డిమాండ్ ఎక్కువన్నమాట. అదే నాకు వస్తే కళ్ళకద్దుకొనేవాడిని" అన్నాడు గిరి.

"నేనుమాత్రం కాదన్నానా... కాని వుద్యోగం లేకుండా......"

"వుద్యోగం! వుద్యోగం!! వచ్చేవాళ్ళ పాదమహిమవల్ల వెంటనే రాకూడదూ వుద్యోగం? ఒరే యికనీఅడ్డుపెటివన్నీ ఏమీ చెల్లనేరవు" అన్నాడు గిరి ఒక నిశ్చితాభిప్రాయంతో.

నీలాటిరేవులో నిల్చొన్న కామాక్షమ్మగారు, వచ్చేవారితోను, పోయేవారితోనూ,

(55 వ పేజీ చూడండి)



# కథల కథ



పన్నెండేళ్ల పాప ప్రతి శనివారం రాత్రి "ఎప్పుడు తెల్లారిపోతుందా, ఎప్పుడు ఆంధ్రపత్రిక వారపత్రిక చూస్తానా?" అనే ఆలోచిస్తుండేది... ఆదివారం ఉదయమే పాప నాన్నగారు తాతగారితో కలసి బజారు కెళ్లిపోయేవారు. స్నేహితులతో కలసి తిరగడానికని నాన్న అటూ ఇటూపోతే- తాత మాత్రం పాపకోసమని వారపత్రికా, తన కోసమని మరికొన్ని పత్రికలూ కొని ఇంటి వెచ్చాలు తీసుకొని తొందరగా తిరిగి వచ్చేసేవాడు. రాగానే పాప తాతమీదకు ఎగబడి పత్రిక లాక్కొని తనగదిలోకి పరుగెత్తిపోయేది...

ఒకరోజు మామూలుగానే ఆత్రంగా తాత చేతిలోని వారపత్రిక లాక్కొని పేజీలు తిరగేస్తున్నది పాప. హఠాత్తుగా ఆ పిల్ల కళ్లకి "దసరా పిల్లల ప్రత్యేక సంచిక" ప్రకటన కన్పించింది— గబగబా ఆ ప్రకటన సాంతం చదివేసింది. పాపకి అంతవరకూ కథలు చదవడం చెప్పడం తప్ప కథలు వ్రాయడం అలవాటులేదు, కాని- బొమ్మరిల్లులో తన కథలు రంగు రంగుల బొమ్మల్తో పడాలనీ, తన పేరు ఎంచక్కా అచ్చవాలనీ ఎన్నాళ్లనుంచో కోర్కగా ఉండేది. తానూ ఓకథ వ్రాసి పంపిస్తే?... ఈసారైనా తప్పకుండా ఒక కథ వ్రాయాలనుకొంది. బాగా ఆలోచించి చూచింది తన గదిలో తీరిగ్గా కూర్చుని చక్కగా ఒక కథ వ్రాసేసింది— శ్రమపడి!.

సాయంత్రం - తాత తోటలో పడక్కుర్చీలో పడుకొని ఆకాశంలోకి చూస్తూ ఆనందిస్తున్నాడు పాప మెల్లగా వెళ్లి తాను వ్రాసిన కథని తాతకిచ్చింది, చూడమని. తాత అదిచూస్తూనే వింతగా "ఇదేమిటమ్మా!" అన్నాడు.

---

**కె. పి. బాబు**

---

"ఆంధ్ర వారపత్రిక్కి"

"ఓ ఇంకేం!" అంటూ ఆనందంతో పాపకథని పరిశీలించసాగాడు తాత. ఆత్రం కన్పించనీకుండా చూస్తూ నిలబడింది పాప.

అంతా చదివాక "అయితే పాపా! నేనొకటడుగుతాను. నిజం చెప్తావా?" అనడిగాడు తాత.

"ఓ. తప్పకుండాను!" అంది.

"ఈ కథ చాల బాగుందమ్మా! కాని, ఇలా చూడుపాపా, ఇది నీ పాఠాల పుస్తకంలోది కాదు కదా?" అన్నాడు నెమ్మదిగాను. పాప బిక్కముఖం పెట్టేసింది. తాత నవ్వాడు— "స్వంతంగా ఊహించి, కల్పించి స్వతంత్రంగా వ్రాసి పంపాలి కాని, కథలు కాపీ కొట్టి వ్రాయకూడదమ్మా! అది చాల తప్పు." పాప చాల చిన్నబుచ్చుకొంది— "తాతా! మరి - నాకు కథలు చదవడం, ఇంకోళ్లకి చెప్పడమైతే బాగా వచ్చుగాని, కథలు రాయడం రాదు - కదా—! ఎలా చెప్పు?" అంది.

"స్వంతంగా ఊహించి కథలు వ్రాయడం చేతకాదని, కాపీ కొట్టడం కూడదమ్మా! ప్రయత్నించాలి, సాధించాలి! అదీ మంచి పని!" అన్నాడు తాత. "కథలు స్వంతంగా రాయడమెట్లా?" అంటూ ఎంతో ఆశగా, అడిగింది పాప. "గట్టి చిక్కే తెచ్చిపెట్టావే! సాధారణంగా మన చుట్టుప్రక్కల్లో ఎవ్వరూ కూడా ఒక విద్యగా ఈ కథలు వ్రాయడాన్ని నేర్చుకోలేదు. ఇతరదేశాల్లో అక్కడ కూడా దీనికి పద్ధతులంటూ కొన్ని నేర్పుతారట కాని, మన దేశంలో ఆ విధానాలు లేనట్లే!" అంటూ బుర్ర గోక్కున్నాడు తాత. పాప ఉన్నట్లుండి చటుక్కున "అయితే, నీవెలా వ్రాయగల్గుతున్నావమ్మా?" అనడిగింది వుడుకుమోతుతనంగా.

"అవును మంచిప్రశ్నే అడిగావు పాపా! నేను కథలు వ్రాయడం ఎట్లా అలవాటు చేసుకొన్నానో, మొదటినుంచీ వివరంగా చెప్తాను— బాగావిను నీవూ ఆవిధంగా చేస్తే నీకూ కథలు వ్రాయడం అలవాటౌతుందేమో!" అంటూ తాత ఇలా చెప్పడం ప్రారంభించాడు...

"నా చిన్నతనంలో— అంటే స్కూల్లో చదువుకొనే రోజుల్లో

సంగతి - అప్పుడు నాకు తీరికైనప్పుడల్లా, ఏవైనా కథల పుస్తకాలు చదువుకోవాలనీ, ఆటలాడుకోవాలనీ ఉత్సాహపడేవాణ్ణి. పుస్తకాలు విపరీతంగా చదువుతుంటే, నాకేవేవో క్రొత్తక్రొత్త ఊహలు పుట్టుండేవి నేనూ కథలు వ్రాయాలని, అన్పించేది. స్కూల్లో కూడా కాంపోజిషన్లు బాగా వ్రాసేవాడినని నన్ను మా మేష్టర్లు మెచ్చుకొనేవాళ్లు. ఇంట్లో అందరూ - ఇప్పుడు నిన్నంటున్నట్లే, అప్పుడు నన్నుకూడా - తెలివిగల బుర్ర అంటూండేవారు. అవన్నీ చూస్తుంటే, తప్పకుండా కథలు వ్రాస్తే, బాగా వ్రాయగలనని తోచింది! అంతే— ఒకనాడు చటుక్కున, ఊహించి స్వతంత్రంగా ఒక కథ వ్రాసి పారేశాను"

పాప భుజాలెగరేస్తూ "ఓస్. ఇంతేనా? అయితే రేపట్నుంచే నేనింకా బోలెడు పుస్తకాలు చదువుతాను... కాని నిలా నాకూ కథలు వ్రాయడం వస్తుందంటావా తాతా?..." అంది. తాత నవ్వి ఇలా చెప్పాడు— "అప్పుడే కథ అయిపోలేదమ్మా! పూర్తిగా విను

"ఆ మర్నాడు నాకేమో అనిపించి, నేను వ్రాసిన కథని మా తెలుగు మాష్టారుకి చూపించాను. ఆయన చదివి నన్ను చూచి నవ్వారు. 'నీకథ ఎలాగుందో నేను చెప్పటం ఎందుకు కాని, నీ ప్రాణస్నేహితుడెవరికైనా చదివి విన్పించు. ఆ తరువాత నాదగ్గరకు రా' అన్నారు. ఆయన మాటలంటే నాకెంతో గురి. నా కథని ఒకనాటి సాయంకాలం స్నేహితుడొకణ్ణి తోటలోకి తీసుకువెళ్లి అక్కడ సర్దాగా చదివి విన్పించాను."

"అప్పుడేం జరిగిందేమిటి తాతా?" అని అడ్డుపడింది పాప.

"అదేమిటోగాని, అలా చదువుతుంటే ఏవో కొన్ని లోపాలు నాకే కన్పించాయి ఆకథ విన్న నా మిత్రుడు కూడా నిర్మొగమాటంగా ఎక్కడ బాగాలేదో చెప్పాడు. పైగా వాడి ఉద్దేశ్యంలో ఆకథ ఎక్కడ ఏవిధంగా ఉంటే ఇంకా బాగుంటుందో అదంతా కూడా చెప్పాడు. వాడు నా స్నేహితుడు కనుక, అలా చెప్పినా నాకేం బాధగాని సిగ్గుగాని కలుగలేదు. అప్పుడు నేను తిరిగి ఆ కథని కొంత సరిచేసి, మళ్లీ మా పంతులుగారికి చూపించాను.

మళ్లీ పాప అందుకొని "మరి పంతులుగారు రెండోసారేమన్నారు తాతా?" అనడిగింది.

"చెప్తున్నా తొందరపడకూ!... ఆయన నేను తిరుగ వ్రాసుకొచ్చిన కథని చూచి "నీకెలాగుందిరా?" అనడిగారు "నాకు బాగానే ఉంద"న్నాను. "సరే— ఈ కథని భద్రంగా కొంతకాలం దాచి వుంచు. తర్వాత చూద్దాం" అని చెప్పారు.

"నాకు చాల ఆశాభంగం కలిగినా ఆయన చెప్పారుగదా అని అలానే చేశాను. మరుసటి నెలలోనే మా స్కూలు తరఫున ఒక పత్రిక ప్రకటించడానికి సన్నాహాలు ప్రారంభించారు. స్కూలు విద్యార్థులందరిచేతా రచనలు వ్రాయించి, వాటినన్నిటినీ సరిదిద్ది ప్రకటించే భారం మా పంతులుగారిమీద పడింది. ఆయన ప్రథమంగా నా కథని గురించి అడిగారు. చాల సంతోషంగా ఇస్తానని చెప్పాను. ఇంటికొచ్చి దాచి ఉంచిన 'నా కథనుతీసి చదివి చూశాను. స్కూలుపత్రికలో నాకథ పడ్తే ఎంతోమంది చదువుతారు గదా; వాళ్లందరూ బాగుందంటారో లేదో అని ఆలోచించిచూస్తే, ఆకథ నాకేమీ తృప్తిగా లేదు. అంతకుముందు ప్రతిరోజూ నేను దాన్నిగురించే ఆలోచిస్తుండేవాణ్ణి కనుక— నాకింకా ఎన్నోలోట్లు దానిలో కనిపించాయి. కాని, వాటిని సర్దగలననే ధీమాకూడా కలిగింది. అంచేతనే తిరిగి ఆ కథని సరిదిద్ది వ్రాసి మా పంతులుగారికిచ్చాను. అప్పటికి ఆయన నా భుజంతట్టి 'బాగుందిరా' అన్నారు... అంతేకాదు, స్కూలు పత్రికలో మొదటి పేజీల్లోనే నా కథ వేశారుకూడా' నా కథ చదివినవాళ్లంతా చాల మెచ్చుకొన్నారు. చాలమంది నేనే అంతచక్కని కథ వ్రాశానంటే నమ్మలేకపోయారు కూడాను..." అంటూ తాత ముసిముసి నవ్వులు విసిరాడు

పాప ఇదంతా విని నోరావలించి "అబ్బో! చాల కథే ఉందే దీనికి?" అంది.

"మనం వ్రాసే కథలు బాగా కుదరడానికి ఇంతే కాదు, ఇంకా ఎంతైనా శ్రమపడాలని నేను స్వానుభవంమీద తెల్సుకో

(53-వ పేజీ చూడండి)



ఎమ్. పి. ప్రొడక్షన్స్ వారి "బాబ్లా" హిందీ చిత్రంలో మాస్టర్ నిరేన్, శోభాసేన్.

# కదిలించే చిత్రాలు

"కదిలేదీ, కదిలించేదీ" నవకవనానికి కావాలన్నాడు వెనకటికొక నవకవి. ఆ నవకవి కోరిక కవిత్వంవిషయంలో నెరవేరిందో లేదో చెప్పలేనుగాని, సినిమాల విషయంలో పూర్తిగా నెరవేరిందని ఢంకా బజాయించి చెప్పవచ్చు.

ప్రొజెక్టరులో అనేక వేల బొమ్మలు అతి వేగంగా కదులుతూండడంవల్లనే తెరమీద చలనచిత్రం కనిపిస్తున్నదని అందరికీ తెలిసినదే.

కదలడమంటే కదలడమని కాక, అతి వేగంగా, శరవేగంగా, వాయువేగంగా కదలగల కళ ఒక్కటే; అదే సినిమాకళ. ఇలా కదలగల శక్తి మరే కళకూ లేదు.

ఇక కదిలించడంలోకూడా సినిమాలకున్న శక్తి మరి దేనికీ లేదు.

ఈ శక్తి కాలం గడుస్తున్నకొద్దీ, డైరెక్టర్లు, తారలు అనుభవం గడిస్తున్నకొద్దీ వృద్ధిచెందుతోందని మళ్ళీ ఇంకోసారి ఢంకా బజాయించి చెప్పచ్చు.

ఈ రోజుల్లో వెలువడుతున్న తెలుగు చిత్రాలు ఇదివరకటివాటికన్న ప్రేక్షకులను బాగా కదిలించగలుగుతున్నాయని ఇటీవలి బాక్సాఫీస్ లెక్కలవల్ల బుజువౌతున్నది. చిత్రనిర్మాతలు తాము సాధించిన ఈ అభివృద్ధి చూసి తామే ఆశ్చర్యపోతున్నారు.

ఈమధ్య విడుదలైన కొన్ని జానపద చిత్రాలు మొదటి ఆటకు హాజరైన ప్రేక్షకుల్ని ఆటమధ్యలోనే కదిలించేశాయి. ఆటమధ్యలో కదిలిపోయే ప్రేక్షకుల్ని చూసి రెండో ఆటకోసం వచ్చిన జనం కూడా కదిలిపోసాగారు. గొప్ప డైరెక్టర్ల చేత తీయబడి, గొప్ప తారల చేత నటించబడిన ఈ చిత్రాలు ప్రేక్షకులను సశరీరంగా కదిలించడం చూసి అందరూ ఆశ్చర్యమూర్ఛితులయ్యారు. ఈ అపూర్వ విజయానికి నిర్మాతల హృదయాలు కూడా అతి వేగంగా కదిలిపోయాయి.

తమ చిత్రాలు ప్రేక్షకులను కదిలించడానికి కారణమేమై వుంటుందా అని నిర్మాతలు తర్జనభర్జనలు చేస్తున్నారు. రాజాజీ, కేసార్లు చేసే దుర్భాషలు విని ప్రజలు కదిలిపోతున్నారని కొందరనుమానిస్తున్నారు. ప్రజలదగ్గిర డబ్బు లేకపోవడంవల్లనని కొందరు భావిస్తున్నారు. కథకి సంబంధంలేని సన్నివేశాలు, సన్నివేశాలతో సంబంధంలేని పాటలు, దేనితోనూ సంబంధంలేని చిత్రం పోకడా — ఇవే కారణమని కొందరు విమర్శకులు చెప్పే గోల ఎవరికీ వినిపించడంలేదు. లౌకికమైన ఏ కారణాలూ ఒప్పుకోక మరికొందరు నిర్మాతలు కొన్ని అలౌకిక శక్తుల దుష్ప్రభావంవల్ల, అంటే తాము చిత్రం ప్రారంభించిన వేళావిశేషం, తమ కారు నంబరు, తమ జన్మదినం మొదలైనవాటి ప్రభావం



రోహిణీవారి "ప్రతిజ్ఞ"లో సావిత్రి.



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి "పెంపుడుకొడుకు" లో ప్రసాద్.

# కదిలించే చిత్రాలు

వల్ల, తమ చిత్రాలు ప్రేక్షకులను కదిలించేస్తున్నాయని భావిస్తున్నారు.

మొత్తంమీద యావన్మంది నిర్మాతలూ "కదిలేది కదిలించనిదీ, కావాలోయ్ నవ సినిమాలకు" అని త్రికరణశుద్ధిగా కోరుకుంటున్నారు

* * *

అమావాస్యరోజున చంద్రుణ్ణయినా చూడగలమేమోగాని, పాటలు లేని భారతీయ చిత్రం ఇప్పట్లో చూడగలమనే ఆశ లేదు. ఇటీవల ఒకాయన లెక్కగట్టాడు, ఇండియాలో ఇప్పటికి ముప్ఫయ్ వేల సినిమా పాటలు తయారయ్యాయనీ, వీటిమీద నిర్మాతలు యాభైకోట్ల అడుగుల ముడి ఫిల్ము, అయిదు లక్షల షూటింగ్ గంటలు, పదికోట్ల రూపాయలు ఖర్చు పెట్టారనీ

పాటలు లేందే చిత్రానికి డబ్బు రాదని నిర్మాతల తలపు

కొన్ని కొన్ని సినిమాలు చూస్తే, నిర్మాత కవిగార్ని పిలిచి, కథాగిథా చెప్పకుండా 'అయ్యా నాకు పదిహేను పాటలు కావాలి' అని అడుగుతాడనీ, కవిగారు కొన్ని శోక గీతాలు, కొన్ని శృంగార గీతాలు, కొన్ని హాస్యగీతాలు, కొన్ని రౌద్రగీతాలు, ఇలా నవరసాల్లోనూ గీతాలు వ్రాసి సమర్పిస్తాడనీ, వాటిని ప్రతి పదేసినిమిషాలకి ఒకటి చొప్పున నిర్మాత వాడుకుంటాడనీ అనిపిస్తుంది

ఈగీతాలకు సంగీతంఇవ్వడంలో, సంగీత దర్శకుడు శోకగీతాలకు పంజాబీ సంగీతం, శృంగారగీతాలకు కర్నాటక రుంబా సంగీతం, హాస్యగీతాలకు మరేదో ఆఫ్రికన్ అండమాన్ సంగీతం ఇస్తాడనిపిస్తుంది

సాధారణంగా నిర్మాతలు మూడోరకం కవుల్ని పాటలు వ్రాయడానికి నియమిస్తారు ఒకవేళ ఒకటోరకం కవుల్ని నియమించినా, మూడోరకం కవిత్వం వ్రాయించుకుంటారు వాక్యాలు వ్రాయడం చేతనైన ప్రతివాడూ సినిమాకవి కావచ్చు దేశ

విజయవాడ లక్ష్మీ టాకీసులో దేవదాసు శతదినోత్సవ సందర్భంలో శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు శరత్ చిత్రపటాన్ని, శ్రీ చిలకలపూడి వెంకటేశ్వర శర్మగారు శ్రీ॥ శ్రీ॥ సుబ్బరామన్ గారి చిత్రపటాన్ని ఆవిష్కరించినప్పటి దృశ్యం.



భక్తి గేయాలు వ్రాయడంకంటే కూడా సినిమా పాటలు వ్రాయడమే తేలిక. పాట యొక్క అక్షర స్వరూపాన్ని సంగీత దర్శకుడే నిర్ణయిస్తాడు కనుక సినిమా పాట సాధారణంగా "నజీవీతా పడావా, మునీగీ—పోయేనాట్టనాడీ కడాలీలోనా" అనే ధోరణిలో వుంటుంది. ఈ పాటలకి శబ్దదోషాలూ, సమాసదోషాలూ అంటవు.

కథానాయిక కూర్చుంటూ ఒక పాట, కథానాయకుడు నుంచుంటూ ఒక పాట, ఇద్దరూ కలిసి నవ్వుతూ ఒక పాట, ఏడుస్తూ ఒక పాట.

ప్రేక్షకులకు ముందే తెలిసిపోతుంది ఎప్పుడు ఏ పాట రాబోతోందో. ఆ పాట

(50-వ పేజీ చూడుడు)

# ప్రశ్నలు..సమాధానాలు

కె బి. దొర—కాకినాడ

భారతమును రచించిన తిక్కనకంటె భాగవతమును రచించిన పోతనకంటె "రాఘవ పాండవీయం" రచించిన సూరన గొప్పకవి యని నా అభిప్రాయం. మీరు నాతో ఏకీభవిస్తారా? లేకపోతే మీదృష్టిలో ఎవరు వీరిలో గొప్పవారో తెలుపండి?

—మీ అభిరుచినిబట్టి శ్లేషాలంకారం పుష్కలంగావున్న కావ్యమే గొప్పదన్న మాట పండితు లెవ్వరూ శ్లేషకు ఇంత పెద్ద స్థానం ఇవ్వలేగు మీరు పేర్కొన్న ముగ్గురు కవుల్లో తిక్కనకే చాలమంది పండితులు ఎక్కువ స్థానం ఇచ్చారు.

* * *

వి డి జయపాలు—బద్వేలు.

సోవియట్ ఫిలిం "ఫాల్ ఆఫ్ బెర్లిన్"లో హిట్లరు, అతని భార్య విషము త్రాగి చనిపోయినటుల చూపించారు కాని హిట్లరు మరణవిషయము చాలామంది వేరేవిధముగా చెప్పుకొందురు. ఇందులో ఏది నిజమో తెల్పెదరా?

—వదంతులు రకరకాలుగా వుంటాయి. హిట్లరు చనిపోగూడా లేదా అనేది కాదు ముఖ్యం, హిట్లరిజం ఇంకా బ్రతికే వున్నదనేదే ముఖ్యం.

* * *

ఎస్ ఎమ్ బాషా—బద్వేలు

కృష్ణలీలలో నటించిన 'రాజేశ్వరరావు' సంగీతదర్శకుడు రాజేశ్వరరావు ఒక్కరేనా?

—ఒక్కరే




శ్రీరాజరాజేశ్వరీవారి "లక్ష్మమ్మ"లో సి. ఎస్. ఆర్.

'ఆంధ్రపత్రిక' ఆంధ్రుల పత్రిక కదా మరి ఆంగ్ల చిత్రాలు, తమిళ చిత్రాలను గూర్చి కూడా తెలుపుతుం దేమిటి?

—ఆంధ్రులు తమ్మగురించి తప్ప ఇంకెవరి గురించీ తెలుసుకోగూడదా?

* * *

కె. వి. కృష్ణ—ఒంగోలు

అనేక భారత కాలక్షేపములలో గాని, అనేక పుస్తకములలో గాని నూరుగురు కౌరవులలో మొదట నలుగురైదుగురు పేరు తప్ప తక్కినవి కనిపించవు ఆ పేర్లు మన తెలుగు భారతములో నే లేవా? లేక వేదవ్యాసుని చే రచింపబడిన సంస్కృత భారతములో కూడ లేవా? అసలు ధృతరాష్ట్రుడు, గాంధారి కౌరవులందరికి పేర్లు పెట్టినారా?

—ఆది పర్వంలో నూరుగురు కౌరవుల పేర్లూ ఇవ్వబడివున్నాయి, చూడండి.

* * *

ఎ. బి. ప్రసాదశర్మ—మొగలితుర్రు.

ఎవరెస్టు శిఖరం ఎక్కినటువంటి టెన్సింగ్ జీవితచరిత్ర ఒక సినిమాకింద తీస్తారని విన్నాను. తీస్తారా మహాశయా?

—రాజకపూర్ టెన్సింగ్ జీవితచరిత్ర తీయాలని ప్రయత్నిస్తున్నాడు.

అమెరికాలో ఉన్నటువంటి టెలివిజన్ను మన దేశమునకు రాకపోవుటకు కారణము సెలవిస్తారా? రాదంటారా; వస్తుందంటారా?

—టెలివిజన్ సెట్ ఖరీదు మన దేశంలోని జీవనస్థాయినిబట్టి చూస్తే చాలా ఎక్కువ. అందుచేత ఇక్కడ టెలివిజన్ ప్రసారం ప్రారంభిస్తే ఏమాత్రం లాభసాటిగా వుంటుందీ అని ప్రశ్న. మన జీవనస్థాయి బాగా పెరిగితే టెలివిజన్ దిగుమతి చేసుకోవడం కష్టం కాదు.

* * *

ఎమ్. వెంకటేశ్వరరావు.—హనుమకొండ.

ఒక చిత్రము రాణించడానికి ముఖ్యాంశములను నా స్నేహితుల నడుగగా వారు పరి పరి విధముల చెప్పుచున్నారు. మీ అభిప్రాయమేమండి?

—రాణించిన చిత్రాన్నొకదాన్ని, రాణించని చిత్రాన్నొకదాన్నీ తీసుకుని రెంటినీ పరిశీలిస్తే ఒకటి రాణించడానికీ, రెండోది రాణించక పోవడానికీ కారణాలు కనిపిస్తాయి. ఆ కారణాలు దాదాపు అన్ని చిత్రాలకీ వర్తిస్తాయి.

* * *

వై. ఆదిశేషారెడ్డి—నెల్లూరు.

బి. ఏ. సుబ్బారావుగారు తీయుచున్న "రాజు—పేద" చిత్రంలో కవలపిల్లలు నటించుట లేదనియు, మాస్టర్ సుధాకర్ రెండుపాత్రలను నటించుచున్నాడనియు విన్నాము. నిజమేనాండి?

—అవును, నిజమే. 30-9-53 తేదీ వారపత్రికలో సినిమా వార్తలనే శీర్షిక చూడండి.

* * *

కనుపర్తి విఠల్‌రావు—నెల్లూరు.

ఆచార్య వినోబా భావేగారు నిర్వహించే "భూదానయజ్ఞం ఉద్యమం" కమ్యూనిస్టు సిద్ధాంతంగదా దానిని కాంగ్రెసు ప్రభుత్వం ఎందువలన నిషేధించ లేదండి?

—అది కమ్యూనిస్టు సిద్ధాంతం అంటే కమ్యూనిస్టులూ ఒప్పుకోరు. బహుశా భావేగారూ ఒప్పుకోరు. దాని పేరు కేవలం 'సర్వోదయ సిద్ధాంతం.'









# కదిలించే చిత్రాలు

(47 వ పేజీ తరువాయి)

అయిపోయేదాకా ముళ్లమీద కూర్చున్నట్టు కూర్చుంటారు.

రానురాను సినిమాల్లో పాటలు అనుభవించక తప్పదని ప్రమాదంగా పరిణమిస్తున్నాయి. ఈ సంగతి నిర్మాతలు త్వరలో గ్రహించడం మంచిది.

—"ఎన్నార్"

## ★ సినిమా వార్తలు ★

"ఎలిఫెంట్ బోయ్" సాబూ ఈ నెల 19 వ తేదీన బొంబాయి విమానాశ్రయంలో దిగినప్పుడు సినీతారాభిమానులు, స్కూలు పిల్లలు పెద్ద సమూహంగా పోగై "సాబూ సాబూ" అనే కేకలతో అతన్ని గుముటారు. కొద్ది గజాలదూరంలో తనకోసం వేచివున్న కారును చాలా కష్టపడి చేరుకున్నాడు. అతనికి స్వాగత మివ్వడానికి ప్రొడ్యూసర్ డైరెక్టర్ కిశోర్ సాహూ, అతని భార్య వచ్చారు. కిశోర్ సాహూ తను తీయబోయే "హాదా" అనే చిత్రంలోకి సాబూను బుక్ చేశాడు. సాహూ చేత ఆహూతుడై సాబూ రోమ్ నగరం నుంచి వచ్చాడు. సాబూతో అతని అమెరికన్ భార్య కూడా వచ్చింది.

సాబూ మైసూరు రాష్ట్రంలో జన్మించాడు. మాతృభాష కన్నడం. 1936 లో ఇండియా వదలి హాలీవుడ్‌లో జంగిల్ చిత్రాల్లో నటించడానికి వెళ్లిపోయాడు. 17 ఏళ్ళ తర్వాత స్వదేశం వచ్చాడు. స్వదేశాగమనం తనకు చాలా సంతోషకరంగా వున్నదనీ, తన సంతోషం ఎలా వెల్లడించాలో తెలియకుండా వుందనీ అతడు పత్రికా విలేఖరులతో అన్నాడు. సాబూ అమెరికన్ ఉచ్చారణతో ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడతాడు. కాని తన మాతృభాషను మరిచిపోలేదనీ, ఎవరన్నా కన్నడం మాట్లాడుతుంటే బాగా అర్థం చేసుకోగలననీ, తను మాట్లాడవలసివస్తే కష్టంమీద మాట్లాడవలసి వస్తుందనీ అన్నాడు.

ఇండియాలో తన కార్యక్రమం ఇంకా నిర్ణయించుకోలేదనీ, కాని వీలు దొరకగానే స్వగ్రామంపోయి తనవాళ్లను చూసి వస్తాననీ, కొద్దిరోజుల్లో తన కారు బొంబాయి వస్తుందనీ, అందులో మైసూరు తదితర ప్రదేశాలు పర్యటిస్తానని సాబూ అన్నాడు. మూడు నాలుగు నెలలు ఇండియాలోనే వుంటాననీ, ఆ తరవాత హాలీవుడ్ వెళ్లడమో, లేక ఇక్కడే మరి కొన్ని రోజులు గడపడమో నిర్ణయిస్తాననీ అతడన్నాడు. సాబూ కిప్పుడు 29 ఏళ్లు. అతనితో అతని రెండున్నరఏళ్ల కుమారుడు పాల్ కూడా వచ్చాడు.



మద్రాసు ఆర్టు ప్రొడక్షన్సువారి "రోహిణి"లో రోహిణి మరణదృశ్యం: మాధురీదేవి, సహస్రనామం, ఆదిశేషయ్య మున్నగువారు.



ఎమ్. పి. ప్రొడక్షన్స్‌వారి "బాబ్లా"లో పహారీ సన్యాల్, మంజూ దే.

బొంబాయి, ఎమ్ ఎండ్ టి స్టూడియోస్‌లో గత నెల 21 వ తేదీన సాహితీ పిక్చర్స్ వారు "పాపాయి" అనే తెలుగు చిత్రం ప్రారంభించారు. ఇందులో నారాయణరావు, జమున, శివరావు, కనకం మున్నగువారు నటిస్తారు. కథ, పాటలు తాండ్ర వ్రాశారు.

* * * *

మద్రాసులో ఉమా టాకీస్ (కలీస్ ఏరియాలో) అనే కొత్త సినిమా థియేటరు ఈ నెల 17 వ తేదీన ప్రారంభించబడింది. భాస్కర్ ప్రొడక్షన్స్ వారి "బ్రతుకు తెరువు" తో ప్రారంభోత్సవం జరిగింది. దీని అధిపతి శ్రీ కృష్ణా టాకీస్ అధిపతి డి. మునిరత్నం నాయుడు గారు.

* * *

ఫిల్మిస్థాన్‌వారు తమ "అనార్కలీ" చిత్రం గొప్ప ఆర్థికవిజయం పొందడంతో ఇకముందు కూడా సంగీత ప్రధాన చిత్రాలే తీయడానికి నిశ్చయించారు. విడుదలకు సిద్ధంగా వున్న "షర్త్" చిత్రానికి, పూర్తి కావస్తున్న "సమ్రాట్" చిత్రానికి ప్రసిద్ధ బెంగాలీ సంగీతదర్శకుడు హేమంతకుమార్ ముఖర్జీ సంగీతం సమకూర్చాడు. మొదటిది అపరాధ పరిశోధక చిత్రం, రెండోది సముద్రపు దొంగల కథగల చిత్రం. వీరి మూడవ చిత్రం "నాస్తిక్"లో కూడా విరివిగా పాట లుంటాయట. దీని సంగీత దర్శకుడు సి. రామచంద్ర. లతా మంగేష్కర్ పాడిన ఒక ఘజల్ ఈ చిత్రంలోకల్లా ముఖ్యమైన ఆకర్షణ అట.

* * *

మామూలు త్రీ - డీ చిత్రాల్లోవలెకాక, ఒకే కామెరాతో, ఒకే ఫిలింమీద షూట్ చెయ్యడానికి వీలిచ్చే పద్ధతి వియన్నాలో కనుగొనబడి ఇటీవల హాలీవుడ్‌లో కొందరికి చూపించబడిందట. ఈ పద్ధతిలో తెరమీద ఎక్కువ కాంతి లేకపోవడం మొదలైన లోపా లుండడంచేత దానిమీద ఎగ్జిబిటర్లెవరూ ఆసక్తి చూపడంలేదట. ప్రస్తుతం అందరిచూపూ సినిమాస్కోప్ పద్ధతిమీదనే వున్నదట. ★

# ★ కాలక్షేపం ★

(5-వ పేజీ తరువాయి)

గడవదాటి, తరించానని తనివిజెందుతాడు. ఈ అజ్ఞానమే ఆబాలగోపాలం అందరికీ ఉంది. తప్పెవరిది? అనే ప్రశ్న ప్రపంచం పుట్టినప్పటినుంచీ ఉంది. ఆదాము కాలం నుంచీ, హవ్వ కాలంనుంచీ ఉంది. ఏదేను తోటలో తినకూడదని భగవంతుడు నిషేధించిన పండును తినవచ్చునని సైతాను ప్రోద్బలంచేసింది హవ్వకోసింది. ఆదామును తినవలసినదని కోసితెచ్చి యిచ్చింది. ఇద్దరూ తిన్నారు సైతాను మాయలో పడ్డారు అందువల్ల భగవంతునకు దూరమై పోయినారు బైబిలు గ్రంథంలో ఆదిపురుషుల కథ యిది ఆదాము పురుషుడు. హవ్వ అనేది స్త్రీ వారిద్దరూ ఆదిమానవ దంపతులు ఈ కథలో తప్పెవరిది? ఎవరితప్పు వారిదే అని చివరకు తీర్పు చెప్పక తప్పదు.

మానవుడు పతితుడై భ్రష్టుడై అధోగతి పాలై పోయినాడని వేదనపడి రోదనచేయవలసిన అగత్యంలేదు. "కొంప మునిగిపోతోంది! లోకం తగులబడిపోతోంది!" అని గుండెలు బాదుకొనవలసిన అగత్యంలేదు. ఈ ప్రపంచం నీదికాదు. ఈ జీవరాసులనన్నింటినీ కాపాడేది నీవుకాదు నీ శరీరమే నీదికాదు శంకరాచార్యులవారికి సంభవించిన భగందరవ్యాధికి ఆయన "కర్త" కాడు ఆయన "కర్మ" మాత్రమే. అంతమాత్రంచేత ఆయనకు దేహవిముక్తి కావాలంటే కాలేదు అంతమాత్రంచేత ఆయన జవితం రిక్తం వ్యర్థం కాలేదు.

దేహం అనేది ఒక అద్దెకొంపవంటిదన్నారు పెద్దలు. అంటే ఏమిటి? అది మన స్వగృహంకాదు అద్దె కంట్రోల్ ఆఫీసరు ఎవడో ఒకడు నిర్ణయించి యిచ్చిన అద్దెకొంప-అలాగయితే ఈఅద్దెకొంపకు అధికార్లం మనంకాదు. కాని, కొంపలు కాలిపోతూ ఉంటే, నూతులు త్రవ్వడం తెలివి తక్కువపని అనడంలో తెలివి తక్కువ ఉంది కాలిపోయే కొంపలను ఆర్పగల శక్తి మనకు ఎంతవరకు ఉన్నదో మనకే తెలియదు అందుకనే, కొంపలు కాలిపోతున్నవని గంతులువెయ్యడం తెలివితక్కువ కాని, అందు నిమిత్తమై నూతులు త్రవ్వాలని తలపెట్టడం విధాయకం. ఆఖరు క్షణంలోనైనా సరే, "రావే! యీశ్వర కావవే వరద!" అంటే ఏమీ తప్పులేదు ఈ ఆర్తనాదమే పెరుఇంజను గంటలాగున మ్రోగుతుంది. "లక్ష్మీనృసింహా మమదేహి కరావలంబం" అనే కేక హృదయం లోనుంచి వస్తే కడుపులో మంట చల్లారుతుంది. ఆత్మశాంతి, ఆత్మ ధైర్యం కలుగుతుంది నూతులు వేసే త్రవ్వ నక్కరలేదు. మనంచేసే ప్రతిపనీ ముక్తి సాధనమే. చేసినపని త్రికరణశుద్ధిగా చేస్తే చాలు చేసిన ప్రతిపనినీ త్రికరణశుద్ధిగా కృష్ణార్పణం అంటే చాలు

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ." నీవు ఏమీ చేయవద్దు. నీ వర్ణాశ్రమ ధర్మాలన్నీ కట్టకట్టి తుంగలో త్రొక్కి నన్నుమాత్రమే నమ్ముకో. ఇదే భారత మహాసంగ్రామానంతరం భారత దేశం లోకానికి యిచ్చిన శాంతిసందేశం.

మొదటి ప్రపంచ సంగ్రామమును జర్మను చక్రవర్తియైన కెయిజరు సాగించిన కాలంలో ఎమ్‌డెన అనే పేరుగల ఒక జర్మను యుద్ధనావ మద్రాసు నగరం సమీపమునకువచ్చి మద్రాసుమీద ఫిరంగులను రాత్రివేళ కాల్చింది కొన్ని గుండ్లు మద్రాసులో ఓడల రేవువద్ద పడ్డాయి కిరసనాయిలు నిల్వచేసేటటువంటి బ్రహ్మాండమైన గుండ్లు రేవులో ఉన్నాయి వాటిమీద యీ అగ్ని గోళములుపడి ఆ కిరసనాయిలు గుండ్లు నిప్పంటుకొని అగ్నిపర్వతములవలె మండుతూఉంటే, ఎవ్వరూ ఏమీ చేయలేకపోయినారు. ప్రక్కనే సముద్రం ఉంది. నీటకి తక్కువలేదు. ఫెరుయింజన్లు చెంతనే ఉన్నాయి. ఆ విధంగా ఆ కిరసనాయిలు కటాహములు అహోరాత్రములు మండుతూ ఉంటే అందరూ తూర్పుకుతిరిగి నమస్కారం చేశారు. నూతులు త్రవ్వనక్కరలేదు మంటలు ఆర్పనక్కరలేదు అన్నారు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ"

ఈ గీతావాక్యంతో ముడిపెట్టుకొని నిశ్చింతగా ఉండవలెనన్నారు రామానుజాచార్యులవారు ఆ గీతావాక్యంతో ఎటువంటి జీవితమునైనా ముక్తికి భీమాచేయవచ్చునన్నారు. ఇంతకుమించిన తారకమంత్రం ఇంతకుమించిన అభయపత్రంఎక్కడుంది? శ్రీమతే రామానుజాయనమః ★

# రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫోటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫోటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫోటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం ఫోటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫోటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎట్టిదైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

"ఏమోయ్, మీ కొత్త పనిమనిషి తిన్నగా వుంటోందా?"

"ఆ; ఇప్పటికి అరడజను మంది అయ్యారుగదూ. ఈ మనిషి కూడా వాళ్ళలాగానే పని మానేస్తుందేమోనని చాల మర్యాదగా చూస్తున్నాను."

"అయితే ఇక ఏమిటీ నీ విచారం."

"నా ప్రవర్తన నచ్చక మా ఆవిడ పుట్టింటికెళ్ళిపోయింది"

# కథల కథ

(43-వ పేజి తరువాయి)

గల్గాను." అన్నాడు తాత. "అదీ చెప్పేయి" అంది ఆసక్తిగా పాప.

చందమామ వెలుగులు వెదజల్లుతున్నాడు... చాల ఆహ్లాదకరంగా వుంది!... "నీవు వ్రాసే కథ అయిదు పంక్తుల్లో సరిపోయినా, లేక అయిదు పేజీలైనా, కాక, అయిదొందల పేజీలదైనా— ముఖ్యంగా అది చదివేవాళ్లు ఉత్సాహం కలిగి 'ఇంకా ముందేమి జరుగుతుందో' నసే ఆత్రం పొందేటట్లు వ్రాయాలేగాని, నీరస పడిపోయి నిద్రపోయేట్లుండకూడదు. ఇంకో చిన్న విషయం— చిన్న చిన్న ఇటుకలతో కట్టిన గోడలెంత బలంగా ఉంటాయో, చిన్న చిన్న మాటలతో, వాక్యాలతో వ్రాసిన కథలూ అంత జిగిగాను చక్కగాను ఉంటాయి. కనుక, నీకు తెలియనివీ, అర్థంకానివీ, అయినటువంటి మాటలను, గొప్పకోసం వాడబోకు. చక్కగా నీకర్థమైనటువంటి సుళుభమైన మాటలతోనే ఎప్పుడూ వ్రాయి. అనీ కాకుండా, నీవు చెప్పేదేమిటో సూటిగా, అర్థమౌతుండాలి. అంతేగాని డొంక తిరుగుళ్లుగాను, గంద్రగోళంగాను ఎప్పుడూ వ్రాయకూడదు!— తెలిసిందా?" అన్నాడు తాత.

"తెలిసింది తాతా! కథలు వ్రాయడమంటే ఎంత కష్టమైన పనో బాగా తెలిసింది" అంటూ నవ్వింది పాప. మురిపెంగా పాపని దగ్గరకు తీసుకొని తల నిమురుతూ "మరే మనుకొన్నావమ్మా! ఈ మాత్రం శ్రమపడలేనివారు ఇటువంటి ప్రయత్నాలే చేయకూడదు! సర్దా కొద్దీ శ్రమపడకుండా తొందరపడ్తూ వ్రాసేస్తే కథలు ఏం బాగుంటాయి? నీవు తెలివి తేటలు గలదానివి కనుక— అలా చేయక శ్రమపడి, ఓర్పుతో కృషిచేసి అభివృద్ధిలోకి రాతల్లీ! ఏమంటావ్?" అనడిగాడు.

"నీమాట నేనెప్పుడైనా కాదని తిరిగానా తాతా?" అంది పాప అమాయకంగా. "అయ్యో నా తల్లీ— నేనలా అన్నానా?" అని తాత చెప్తుంటే, పాపతల్లి ఇంట్లో నుండి భోజనాలకు రమ్మని కేకేసింది. "వస్తున్నా" మంటూ అమ్మకి జవాబిచ్చి పాప తాతతో కలిసి లోనికి నడిచివెళ్లుతూ కథలనుగురించి ఆలోచిస్తోంది. "తప్పకుండా నీవభివృద్ధికి వస్తావు పాపా?" తాత పాపని మనసులోనే ఆశీర్వదిస్తూ ముందుకు నడిచాడు.



# ★ నా పరీక్ష ★

(35-వ పేజీ తరువాయి)

లుగా మా అక్కయ్యా నేనూ దెబ్బలాడుకున్నాం. "నాతో ఇలా అనవసరంగా దెబ్బలాడుతున్నావు గనుక నువ్వు పాస్ అవ్వవులే" అంది మా అక్కయ్య. ఇది నిజమేమో అని నా మనసులో ఒకమూల పీకుతున్నా, ఇంతలోకే తగ్గకూడదని సమానంగా పోట్లాడేను.

ఇంతలోకే మా తమ్ముడొచ్చి "అక్కయ్యా నాకు తలకి నూని రాయవే" అన్నాడు. నాకు వళ్ళు మండింది. "పోరా వెధవా" అన్నా. ఇంతలో మా అమ్మగారొచ్చి "ఎందుకే వాణ్ని అల్లా కసురుకుంటావు? అక్కతో దెబ్బలాట చాల్లేదా ఏవిటి? చదువుకున్నావు కూడాను. ఎందుకొచ్చిన చదువు తమ్ముడిని సముదాయించే ఓపికయినా లేదు" అంది.

ఇంతలో మా బామ్మ వచ్చి "కూర కొంచెం తరిగియ్యమ్మా" అంది. తరగకపోతే ఏవిడేవంటుందోనని తప్పనిసరిగా వెళ్లి కత్తిపీటమీద కూర్చున్నాను. కూర తరుగుతున్నానన్నమాటే గాని, మా అక్కయ్యా, మా అమ్మా అన్న మాటలు తలుచుకుంటే, నేను నిజంగా పాస్ అవనేమో అని భయం కలిగింది. కూర తరుగుతున్నానన్న మాటే మరిచిపోయాను. ఇంతలో నా వేలు తెగి రక్తం కారింది. ఎల్లాగో అల్లాగ బామ్మ కంటబడకుండా కూర తరుగుదామనుకున్నాను. మా బామ్మ చూడనే చూసింది. "అదేవిటే నీ సుకుమారం మండిపోనూ! రేపు అత్తారింటికెళ్లినా ఇంతే గావును! అక్కడ నాకు మల్లే ఊరుకునేవాళ్లెవరూ లేరు. (తనేదో ఊరుకున్నట్టు) అయినా ఆడవాళ్లకీ చదువేమిటి? కాలం మారిపోయింది. నాకు నీ యీడుకే మీ నాన్న, మీ అత్తయ్యా కూడా పుట్టారు. నువ్వింకా చిన్న కూచిలాగ కూర తరగడం కూడా నేర్చుకోలేదు. ఒకసారి యిలా చేస్తే రెండోసారి తరగమనరని కాబోలు! ఈ కాలపు వాళ్ళకి ఎంతెంత బుద్ధులయినా వున్నాయి!" అంది.

ఈ మాటలన్నీ విన్నాక నా మనస్సు నా స్వాధీనంలో లేకుండా పోయింది. ఇంతలో మా అన్నయ్యొచ్చి "ఏమేవు నీ రిజల్ట్సు పడ్డాయేవు" అన్నాడు. మా అన్నయ్య చేతులో వున్న పేపరు చూసేటప్పటికి నాకు దడ ప్రారంభమయింది. మా అన్నయ్య "నీ నెంబరెంతా?" అని అడిగాడు. వొణుకుతో నానంబరు 19583 అని చెప్పాను. మా అన్నయ్య పేపరుచూసి మూతి విరిచాడు. ఇంతలో మా అక్కయ్య ఒచ్చి "ఎలా పాసవుతుంది? పెద్దా చిన్నా లెఖ్ఖలేకుండా అయిందానికీ కానిదానికీ నాతో జగడం పెట్టుకొంటుంది. ఇంకెల్లా పాసవుతుంది? అది పాస్ అవుతుందని నేను కలలో కూడా అనుకోలేదు" అంది.

ఎప్పుడొచ్చిందో మా బామ్మ. "దీనికింకా చదువెందుకురా! మానిపించి ఇంట్లో కూర్చోపెట్టక" అంది. ఇదంతా వింటుంటే నా తల తిరిగిపోతోంది. నేను ఎప్పుడూ ఫెయిల్ అవుతానని అనుకోలేదు.

మా నాన్నగారప్పుడే ఆఫీసునుంచొచ్చారు. "అమ్మాయి నువ్వు పాస్ అయ్యావమ్మా" అన్నారు. మా అన్నయ్య "అదేమిటి నాన్నగారూ మీరు తప్పుచూశారేమో! 19583 నంబరు లేదే" అన్నాడు.

"అదేమిటిరా దాని నంబరు 19283 అని నాతో చెప్పిందే" అన్నారు నాన్నగారు. అప్పుడు గ్రహించాను; నేను కంగారులో అన్నయ్యకి తప్పు నెంబరు చెప్పానని. "నా నంబరు 19283 నాన్నగారూ. అన్నయ్యకి తప్పు చెప్పాను" అన్నాను. "అయితే ఇదుగో నమ్మా నీ నంబరు" అన్నారు. నా సంతోషానికింక హద్దు లేదు. మా అక్కయ్య కోసం చూసేసరికి అది ఎప్పుడో పలాయనమంత్రం పఠించింది. "పోనీ అమ్మా దేవుడి దయవలన పాస్ అయ్యావు అంతే చాలు" అంది బామ్మ. మా అన్నయ్య "బామ్మా దానికి పెళ్లి ఎప్పుడు చేద్దాం" అన్నాడు. "చాల్లేరా అది చదువుకోడం నాకుమాత్రం ఇష్టం లేదూ! ఈరోజుల్లో ఇంతింత వాళ్లు కూడా పెద్దవాళ్లని ఆక్షేపించడమే" అంటూ వంటింట్లోకి వెళ్లిపోయింది.

ఏమయితే ఏంగాని మా బామ్మా అక్కయ్యల అభీష్టం మాత్రం నెరవేరలేదు. నా చదువింకా సాగుతూంది. ★

# ★ పెళ్ళిచూపులు! ★

(41-వ పేజీ తరువాయి)

మోహనరావు పెళ్ళివిషయం చెప్పటం మొదలుపెట్టింది.

"ఆలు లేదు - చూలు లేదు - కొడుకు పేరు సోమలింగం పెడదామా" అందిట ఓ మహా యిల్లాలు. అల్లాగ మీ అమ్మగారు చూశావట్రా అందరితోనూ ఏకరువు పెడుతున్నారు" అన్నాడు ప్రకోపంతో మోహన్.

"ఏడిచినట్టే వుంది నీ తెలివి. శుభకార్యం చేసుకుంటున్నావు కాబట్టి నలుగురితోనూ చెబుతోంది. రేపు నువ్వు పెళ్ళిచూపులకి వెళ్ళటం అబద్ధమా, పెళ్ళి చేసుకోవడం అబద్ధమా, కట్నం పుచ్చుకోవడం అబద్ధమా, అయినా అదో సరదా ఆడవాళ్ళకి" అని గిరీ మోహన్ యిళ్ళదారి తీశారు. భోజనం చేసి, కాబోయే పెళ్ళికూతురుని తలుచుకుంటూ మోహన్ నిద్రపోయాడు.

ఒక రాత్రివేళ మోహన్‌కి మెళుకువొచ్చింది.

గది అవతలనుంచి ఏవో మాటలు వినిపిస్తున్నాయి.

"అబ్బాయి పెళ్ళి సంబంధం గురించి ఆయన మళ్ళీ వుత్తరం వ్రాశారు. వుత్తరం అందిన వెంటనే పెళ్ళిచూపులకి రమ్మన్నారు. పాపం!! ఆడపిల్లల్ని కన్నవాళ్ళ ఆతురత చూడండి. ఆయన కెంత శ్రద్ధో!!" అంటోంది గంగమ్మగారు.

"ఏం పెళ్ళి సంబంధం? ఎవరూ?" అన్నాడాయన విసుగ్గా.

"మొన్న రాలా మదరాసునుంచి - ఆయన వుత్తరం వ్రాశారు"

"ఆ! ఆయనా!... వుత్తరం వ్రాశాడా" అన్నాడాయన ఆతురతతో.

"ఊఁ వినండి పెళ్ళికూతురు మదరాసులోనే వుందట - వెంటనే రమ్మన్నారు"

"పెళ్ళికూతురు మదరాసులోనే వుందా. అయితే మనవాడు అదృష్టవంతుడే"

"మీకంతకన్నా చెప్పలేం - పెళ్ళిచూపులకి వెళ్ళినప్పుడు పిల్లను జాగ్రత్తగా చూడండి. పాట, నడక, అంతా కనిపెట్టి ఆఖర్ని కట్నం గురించి తేల్చండి" అంది గంగమ్మగారు.

"ఏడిశావులే— కట్నం ఏమిటి నీ మొహం. పెళ్ళికూతురంటే నిజంగా పెళ్ళికూతురనుకున్నావా ఏమిటి? వీడి ఇంగ్లీషు పేపరు అక్కడ వుందట. అలా వ్రాస్తే నలుగురికీ తెల్లడవుతుందని, పెళ్ళికూతురు క్రింద వ్రాశాడు" అన్నాడు రామారావుగారు.

"ఆ!" అని నోరు తెరిచింది గంగమ్మగారు.

ఇదంతా విన్న మోహన్ నిరాశ, నిస్పృహాలతో బరువుగా శరీరాన్ని పరుపుమీదికి చేరవేశాడు. ★

కొత్తగా పెళ్ళయిన యువతీయువకులు బీచిరోడ్డున కులాసాగా నడుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. భర్త చెప్పే కబుర్లు వింటుంటే భార్యకి అతనంత గొప్పవాడు లోకంలో లేడనిపించింది. ఇద్దరూ సముద్రం వొడ్డుకి వచ్చారు. భర్తకి కవిత్వం కూడా వచ్చు గనక వెంటనే, "అహో నీలసాగర తరంగములార, ఎలుగెత్తి ఘోషించి, ఎగసి ఎగసి పగిలిపొండు," అని ఆవేశంగా అన్నాడు. భార్య సంతోషంతో చప్పట్లు కొట్టి అన్నది:

"డార్లింగ్! సరిగ్గా నువ్వన్నట్టే జరుగుతోంది. చూడు, చూడు."

# స్వార్థమా? త్యాగమా?

(25-వ పేజీ తరువాయి)

చిక్కవచ్చి కూర్చుంది. అతని వళ్లంతా చిగచెమటలు పోయడం మొదలెట్టాయి. అతనిలోని సంస్కారం, అక్కడ అతనికి 'కాదూ' అంటే జరగబోయే నగుబాట్లూ తనద్వారా తన సంఘసభ్యులకు కలగబోతూన్న పరాజయం అన్నీ ఒక్కమాటు బాకులూ యీటెలూ తీసుక మీదికొచ్చినట్లుంది అతనికి. స్నేహితులుకూడా ఆ పిల్లనీ, పిల్లతండ్రినీ యిల్లా ఉద్ధరించడం కన్న వేరే ఏమిటి ధర్మంవుంటో తెలీక, ఆయన ప్రశ్నలకి సమాధానాలు చెప్పలేక, అంతా వెంకట్రావుమీద పడేశారు.

ఈఒక్క పిచ్చి ముసలాయనకు సమాధానంచెప్పి ఒప్పించకపోతే ఏం; ఏన్నో మొండిమాటలు నాలుగు ఝాడించి అక్కడి నుంచి ఉడాయించే బలం వారందరిలోనూ కనబడలేదు. నిజానికి సీతాపతిగారు చెప్పేవన్నీ నిజమైన సమస్యలే! ఆయన సమర్థించే అన్నివిధాలా యోగ్యంగా అందరికీ ఆ వాదోపవాదాల వైపులో అనిపిస్తూంది. పోనీ ఆ అమ్మాయి కురూపి అనో కుంటికాలుదనో తోసెయడానికి వీల్లేకండా గంధర్వకన్యలాగుంది. వెంకట్రావు ఒప్పదల ఎందుకు యివ్వకూడదో తెలీటంలేదు... ఆలోచించాడు వెంకట్రావుకూడా. అలాంటి మనస్తత్వం గలవ్యక్తికి అప్పట్లో వేరేదారిలేదు. వెంకట్రావు సరేనని ఒప్పుకున్నాడు......

అందరిముగాలూ విప్పారినయి. సీతాపతిగారు కళ్లనీళ్ల పర్యంతంగా వెంకట్రావును కౌగలించుకుని 'పూర్ణ'ను పిల్చి యిద్దర్నీ జత చేశాడు. స్నేహితులంతా ఉప్పొంగిపోయి అప్పటికప్పుడే ఒక స్టూడియోకెళ్ళి ఫోటోకూడా లాగించేశారు. సీతాపతిగారిమీద తామంతా ధ్వజమెత్తినట్లు సీతాపతిగారే వాదంలో ఓడిపోయేసి తమ వెంకట్రావే విజయంపొంది తన అచంచలధ్యేయనిష్ఠను రుజూ చేసుకున్నట్లు ఎక్కడలేని ఉపన్యాసాలు దంచేసుకుని ఆయన్ను వెంకట్రావుగారి తల్లిదండ్రుల యింటికి తీసుకెళ్ళి అక్కడ పరిచయం చేశారు. తర్వాతవంతా వ్యక్తిగతంగా ఏవో వాళ్ల కుటుంబవిషయాలకు సంబంధించినదిచిందిం. ఇంతకూ వివాహం యిద్దరికయింది.

వివాహం ఐన మూడో రోజున భోజనాలు చేసి తాంబూలాలు వేసుకుంటూ స్నేహితుల సమక్షంలో, రిటైర్ తాసిల్దారు జనార్దనరావుగారు, —అంటే వెంకట్రావు తండ్రి—వియ్యంకుడితో మాట్లాడుతూ అడిగాడు.

"ఏమండీ సీతాపతిగారూ, యీ ఉదంతం అంతా విన్నాక, నాకు అర్థంకాని మూడు సందేహాలు తేలకుండా వున్నయ్. ఏమిటంటే, ఏదో సామాన్యంగా చందా యివ్వమని వచ్చిన మా వెంకట్రావుకు యింకా పెళ్ళికాలేదని ఎల్లా పసికట్టేశారు? ఇతన్ని మీరు ఒప్పించి తీరుతానని ఎలా నిశ్చయించుకోకలిగారు? పైగా నాకూ మీకూ సంబంధాలున్నాయని ఎల్లా ఊహించగలిగారూ?"

"బావగారూ అదేముందండీ! ఎవరికి ఏ నీళ్ళ రుణమో ఎవరు చెప్పగలరు! ఈ వరదలు రాకపోయినా మీలాంటి దివ్యమైన కుటుంబంతో నేను వియ్యమందుతానని కలలోకూడా అనుకోలేదు.

"వెంకట్రావు ఆరోజున గ్లాస్కో లాల్చీ కాబోలు తొడుక్కుని వచ్చాడు. లోపల బనియను లేనట్టు వుంది. ఒంటమీద ఒంటిపోగు జందెము బాగా కనిపించింది. దానికి తగ్గట్టు యింటిపేరూ అవీ అడిగింతర్వాత మీకూ నాకూ లావాదేవీలు వున్నాయని తెల్సుకున్నాను. తీరల్లా అడిగితే నాకేమయీ వ్యతిరేకంగా సమాధానం చెప్పలేకపోయారు."

"మీరు చాలా ఘటికులండీ! మాట్లాడుతూనే మీ పనులు మీరు చక్కపెట్టుకోగల వ్యక్తులు!"

"స్వార్థమండీ మహాప్రభో! యిది స్వార్థం. ఇది ఎన్ని అబద్ధాలైనా చెప్పిస్తుంది. వెంకట్రావు చేతిలో నోటుబుక్కుమీద వ్రాసినదాన్ని పట్టి అతను బి. ఏ చదువుతున్నాడని తెలుసుకున్నాను. అంతకే అన్ని వదలదలచలేదు."

లోపల కుమ్మరింగులో నించుని, అందాకటినుంచీ వింటూన్న వియ్యపురాలుగారు కూడా అందుకుని అన్నది—

"మీ దగ్గర ఏం మంత్రబలముందో కాని, అంతకుముందు ఏ సంబంధం వచ్చినా వల్లకాదన్నవాడు కాస్తా, తనంతట తానే వచ్చి, యీ వివాహానికి ఒప్పుకోకపోతే సత్యాగ్రహం చేస్తానన్నాడు. అందుకే మేముకూడా 'కాదన'లేకపోయాం."

"అది నామంత్రబలం కాదండీ అది 'గోదావరీ' తల్లి మంత్రబలం. లేకపోతే నేను నీళ్ళల్లోవుండటమే తటస్థించేది కాదు. మా అమ్మాయికి మీ యింట్లో వుండే అదృష్టం లభించేది కాదు." అన్నారు సీతాపతి.

"ఇకనుంచీ యీ రాజకీయాల్లో తిరిగి తన ఆరోగ్యం చెడగొట్టుకుంటున్నాడు. అది కూడా ఎల్లాగో మాన్పించి యింత చదువుకునే అలవాటు చేస్తే - అదే చాలు!"

"అక్కయ్యగారూ, మీకొడుకు అక్కర్లేదు ఇహను! కొద్దిరోజుల్లో యివన్నీ మారిపోతాయనుకోండి. ఇంతకూ అనుభవాన్ని మించిన చదువులేదు. అతను పెళ్లిచేసుకోడం స్వార్థమా? త్యాగమా? చెప్పండి?"

ఆ మాటలు వింటూ కూర్చున్న వెంకట్రావు తనిఖీ చేసింది - "స్వార్థమా? త్యాగమా?" తెల్లీక తికమకపడ్డాడు. ★

తొమ్మిదేళ్ల కుర్రాడు ఏడుస్తూ అమ్మదగ్గరికెళ్లాడు.

"ఎందుకురా ఏడుస్తున్నావ్" అని అమ్మ అడిగింది.

"ఆ, ఏముంది. మీ ఆయన మళ్ళీ కొట్టాడు నన్ను," అన్నాడు వాడు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త:... విశ్వాత్ముల నరసింహమూర్తి





































# ఠాకూర్ బాలిక

ఈ బాలిక తన గ్రామంలోని వీరపురుషులను గురించిన పలుగాధలను వింటున్నట్లునటి స్తున్నదేగాని, వాస్తవంగా తనతెల్లటి, నీలపుగాజు పూసలను చూచుకుని ఎంతగా మురిసి పోతున్నదో గుర్తించండి! ఆగాధలు మూడు పాళ్ల రాజపుత్రగాధలే అయివుంటాయి. ఎందుకంటే ఈ ఠాకూర్ల రక్తంలో రాజపుత్రయుద్ధవీరుల జీర ప్రస్ఫుటంగా కని పిస్తున్నది. పదిహేనవ శతాబ్దంలో మహమద్ బిగడా రాజ్యమేలిన కాలంలో గుజరాత్ నుండి పారిపోయివచ్చినవారు కొందరు, దయాపరులై గౌరవ జీవన సాగిస్తున్న ఈ ఠాకుర్ల ఆశ్రయాన్ని పొందినారు ఈ ఠాకూరులు అక్కడ క్కడ చెదురుగావున్న బహుప్రాచీన వర్గానికి చెందినవారు. వీరు ఠాణా, కొలాబా జిల్లాలలోని అడవులలోను, లేక వాటి పరిసర ప్రాంతాలలోను జీవిస్తుంటారు. వీరు పల్లెల నిర్మాణానికై విశాలమైన బహిరంగ సమ ప్రదేశాలనే ఎల్లప్పుడూ వాడుకుంటారు. కుటీ రాలు నిర్మించుకున్న మీదట వారు అక్కడ స్థిరపడి, వ్యవసాయ దారులుగా నిరాడంబర జీవన సాగిస్తారు.

ఇండియాలో మూరు మూలలలోను నివసిం చెడి వివిధ వర్గాలతో నిరంతరసన్నిహిత సంబంధాన్ని మేము ఏర్పరచు కున్నాము. వారు తమకు కావలసిన పెట్రోలియం ప్రాడక్టులకు మాపై ఆధార పడుతున్నారు గనుక, మేము కూడా వారికి సేవ చేయడము గొప్పగా భావిస్తున్నాము.

**బర్మా-షెల్... భారత జీవితంలో ముఖ్య భాగమై యున్నది**

BSY-722B -TEL